సెప్టెంబరు 1990
సంపుటి : 6
సంచిక : 9

# శ్రీవాణి

సాంస్కృతిక మాసపత్రిక
సంపాదకుడు-కొమరగిరి కృష్ణమోహనరావు

మేనేజర్
కొమరగిరి చంద్రశేఖర్
24-52 రామానాయుడు పేట
మచిలీపట్నం-521 001
ఫోన్ : 2818

విడి ప్రతి : రు. 3-50
సంవత్సర చందా: రు. 42-00
4 సంII ల చందా : రు. 150-00
జీవిత సభ్యత్వం : రు. 600-00

Cheques & Drafts should be drawn in favour of SREE VANI, Monthly Machilipatnam

EDITED, PRINTED & PUBLISHED BY

**Komaragiri Krishna Mohan Rao**

Printed at
SREE VANI PRINTERS
MACHILIPATNAM

## విషయసూచిక



ముఖచిత్రం : విఘ్నేశ్వరుడు, బాబా

# అమృతవాణి

కూచిభట్ల చంద్రశేఖరశర్మ

శ్లో॥ మార్గావర్తిత పాదుకా పశుపతే రంగస్యకూర్చాయతే
గండూషాంబు నిషేచనం పుర రిపోర్ది వ్యాభిషేకాయతే
కించిద్భక్షిత మాంసశేషకబళం నవ్యోపహారాయతే
భక్తిః కిన్నకరోత్యహో ! పనచరో భక్తావతం సాయతే॥

భక్తి అంటే సేవాధర్మం. పెద్దలను సేవించటంలో భక్తి వున్నది. దీనికి మరో మాట ప్రేమ. ఈ ప్రేమ ఎవరిమీద అభిమానం వుంటే వారిమీద కలుగుతుంది. నాది అనుకొనే మమకారం వున్నచోట యీ ప్రేమ పుట్టటం జరుగుతుంది. మామూలుగా వస్తువుల విషయంలోనైనా అంతే.

మనుష్యుల విషయంలో వివరించాలంటే సమానమైన పాయలో వున్న యిరువురి వ్యక్తుల్లో ప్రేమను స్నేహం అనికూడా అంటాము. అదే చిన్నవాళ్ళ విషయంలో పెద్దవాళ్ళకున్న ప్రేమను వాత్సల్యం అని అంటాం. మరి చిన్నవాళ్ళకు కూడా పెద్దల విషయంలో ప్రేమాభిమానాలుండవచ్చు గదా! దాన్నేమంటాం? దాన్నే భక్తి అంటాం. గుణగణాలనుబట్టి, చదువుసంధ్యలను బట్టి, సౌశీల్య సౌజన్యాదులనుబట్టి సంఘంలో సమున్నత గౌరవం సంపాదించిన పెద్దలయందు చిన్నవాళ్ళు చూపించేదాన్ని ప్రేమ అనటంకంటే భక్తి అనే ఒక బరువైన పదంతో పలకటం బాగుంటుంది కదా!

ఆ భక్తి భగవంతునియందు చూపినప్పుడు అది పూర్తిగా సార్థకమౌతుంది. సర్వవ్యాపియై, సత్యరూపంలో సకల లోకపూజ్యుడైన భగవంతునియందు భక్తునికున్న మమకారం భక్తి కాక మరేమవుతుంది? అందుకనే భగవంతుని సేవించాలనే గాఢప్రేమ, వాంఛ భక్తుని యెదలో సర్వదా మెదలుతూంటుంది.

భక్తిభావం వున్నప్పుడు మాలిన్యానికి తావులేదు. కాపట్యానికి అవకాశం లేదు. వట్టి అమాయక స్థితియే వుంటుంది. దీనికి కులమతాలతోను, ఉచ్చనీచదశలతోను సంబంధం లేదు. కావలసింది నిష్కల్మష హృదయం. అదే గొప్ప యోగ్యత. ఈ భక్తి ఎంత ఆటవికుణ్ణయినా మహాభక్తాగ్రేసరునిగా మార్చివేస్తుంది. తిన్నడనే ఆటవికుని కథ అందరికీ తెలిసిందే కదా. ఆ తిన్నడు చేసిన పనులు చూడబోతే వాడెంత అనాగరికుడో అర్థమౌతుంది.

అడవిలో పులులు సింహాలు తిరిగేచోట అతడు శివలింగాన్ని చూచాడు. అయ్యో పాపమని భక్తితో దాన్ని ఆరాధించాడు. తాను తినే మాంసాదులనే శివునికి పెట్టాడు. పరీక్షించాలని శివుడు తన కంటి వెంట నీరు కారిస్తే చెప్పుకాలితో శివుని శిరస్సుమీద నొక్కి బాణంతో తన కన్ను అతనికి అమర్చాడు. రెండు చేతులతో మాంసపు దొప్పలు తెస్తూ నోటనిండా నీళ్లు పుక్కిలించి ఆ నీళ్ళను శివలింగంమీద వుమ్మేసి స్నానం చేయించాడు.

ఏమిటి చెప్పండి యీ కిరాతకపు పని? ఎంత అసహ్యంగా వుంది వినటానికి కూడా? అయినా అది భక్తి అన్నారు. అతడు మహాభక్తుడన్నారు. అనటమేమిటి? శివుడు ప్రత్యక్షమై అతని భక్తికి మెచ్చుకొని చివరికి మోక్షం అనుగ్రహించాడు. ఆ శివుడు కాళహస్తీశ్వరుడే.

భక్తి అనే మహాపవిత్రమైన ఒక ఏకాగ్రభావం శివునియందు గాఢంగా ఆ కిరాత తిన్నడికి వుంది కనుకనే నానాప్రదేశాలు తిరిగిన తన కాలిచెప్పు మన దృష్టిలో ఎంత అపవిత్రమైనా - భక్తప్రియుడైన ఆ శివునికి మెత్తని కుంచలాగా హాయిగా స్పర్శసుఖాన్నిచ్చింది. పుక్కిటినిండా పట్టిన ఎంగిలి మంగలప్పు నీళ్ళయినా ఆ భోలాశంకరునికి దివ్యంగా చేసిన మహాన్యాసపూర్వక రుద్రాభిషేక మయిందట. ఆ కిరాతుడు ముందుగా రుచి చూచి పెట్టిన మాంసం ఆ పరమ శివునికి పంచభక్ష్య పరమాన్నాలతో కూడిన మహానైవేద్యమయినదట.

ఆహా ఏమి ఆశ్చర్యం? భక్తి అలాంటి కిరాతుని యెంత గొప్ప భక్తుణ్ణి చేసింది?

# శక్తి తత్త్వం

సంతోష్

పదార్థం శక్తి నుండి ఉద్భవించినది. ఆ శక్తి ఆత్మనుండి వచ్చినటువంటిది. శక్తికి ఆత్మకు అన్యోన్యాకర్షణ ఉన్నది. ఆత్మను విడచి శక్తి మనలేదు. ఇక్కడ గుర్తించవలసినదల్లా ఆత్మతో శక్తి చేరివున్నదని మాత్రమే. దీనివల్లనే ఆత్మను గ్రహించిన యోగులూ, మునులూ, సిద్ధులూ అనంతమైన శక్తిని పొందగలుగుచున్నారు. ఈ శక్తియే దుర్గాదేవి.

దుర్గమమైన ప్రాంతాలలో వసించునది దుర్గాదేవి. ఈ దుర్గమమైన ప్రాంతాలు ఎక్కడ ఉన్నాయి? ప్రపంచంలో, శరీరంలో, ఆత్మలో ఈ దుర్గమము లున్నాయి. దుర్గమమైనదంటే మిక్కిలి రక్షణ కలిగిన ప్రదేశమనే అర్థాన్ని స్ఫురింపచేస్తూ శంకర భగవత్పాదులు "ఘనేంద్రియ యవయో ద్వారాణి దేహస్థితః, విద్యా వస్తు సమృద్ధి రిత్యఖిల సామగ్రి" అని మనస్సును దుర్గముగా అభివర్ణించారు. ఈ దుర్గాలను మరొక విధముగా సప్త కమలములని చెప్పుకోవచ్చును. ఆధార, స్వాధిష్ట, మణిపూరక, అనాహత, విశుద్ధ, ఆజ్ఞేయ, సహస్రార కమలములవి. ఈ సప్తస్థానాల్లో ఏడుగురు మహాపురుషులు అధిదేవతలుగా ఉన్నారు. ఈ కమలాల మధ్యనున్న మహాతల్లి దుర్గమ్మ. అందుకే సహస్రార కమలమున గల చంద్రమండలాన్ని శ్రీచక్రమనీ, ఇది ప్రకాశవంతమనీ ఋషుల మాట. కేనోపనిషత్తు కూడా "సతస్మిన్నేవాకాశే స్త్రియమాజగామ బహుశోభాయమాన ముమాం హైమవతీం, తాం హోవాచ కిమేతద్ యక్షమితి" అని దుర్గమ్మను ప్రకాశ స్వరూపిణిగాను, శక్తిస్వరూపిణిగాను పేర్కొన్నది. సప్తకమలాలని యింతకుముందు పేర్కొన్న పద్ధతిలోనే తైత్తిరీయోపనిషత్తు పంచకోశాలను పేర్కొని అందులోని ఆనందమయ కోశాన్ని అవిద్యారాహిత్య ప్రదేశంగా పేర్కొంటున్నది. విద్యయే దుర్గాదేవి. పంచకోశాలను నిరాకరించి బ్రహ్మను పొందేవాడు పంచకోశాలనూ ఉల్లంఘించడానికి వీలులేదని గ్రహించాలి.

ఇంకా చెప్పుకోవాలంటే త్రిమూర్తులను దుర్గమ్మకు ఉనికి యిచ్చేవారుగా గ్రహించాలి. వీరే త్రిగుణాలకు, త్ర్యవస్థలకు, త్రిదీక్షలకు, త్రికరణాలకు, త్రితాపాలకు, త్రయీషణాలకు, త్రిప్రసాదాలకు, త్రిపుటికి, త్రివేణికి వాసనాత్రయాలకు సాక్ష్యాలు. వీటిని అధిగమించినప్పుడే దుర్గమ్మ దగ్గరయ్యేది.

దేవతాస్త్రీలు పంచదశ కళలకు ప్రతీకలు. వీటి కావలనున్న దుర్గమ్మ పదునారవ కళ. సురస్త్రీలు పంచదశ నిత్యలు. అమ్మవారు పదునారవ నిత్య భగవద్గీతలో చెప్పిన ఎనిమిది ఉపాధులు "భూమిరాపో అనలో వాయుః ఖంమనోబుద్ధిరేవచ అహంకార" తల్లికి వర్తిస్తాయి. గీతలోనే చెప్పిన సప్తతత్త్వాలు "కీర్తిః శ్రీర్వాక్చ నారీణాం స్మృతిర్మేధా ధృతిః క్షమా" సర్వ సాధారణంగా స్త్రీలలో ఉండేవి. అమ్మది ఎనిమిదవ తత్త్వం. అమ్మకు అష్టదృష్టులున్నవి. ఆవంతి, భోగవతి, మధుర, మను దృష్టులు ఆమె భౌతిక మనోహరత్వాన్ని తెల్పుతాయి. కళ్యాణి, అయోధ్య, విజయ, ధారాదృష్టులు ఆమె తత్త్వాన్ని, విశాలదృష్టి ఆమె ఆగ్రహాన్ని వెల్లడిస్తాయి. ఈ అష్టదృష్టులే అష్ట దిక్కులు, అష్టసిద్ధులు, అష్టైశ్వర్యాలు.

అమ్మ అనంత తత్త్వంలో బిడ్డలు అణువులైనా చాలరు. ఆమె చల్లని చూపులలోని ఏ అణురేఖ కిరణాన్నో కైవసం చేసుకోవడం కోసం అమ్మను ఆరాధించాలి. తల్లి ఆరాధనకు ఆచరణకంటే ఆప్యాయత, ప్రార్థనకంటే ప్రేమ, తపస్సు కంటే తదాత్మ్యం ముఖ్యం. ఆ తల్లి ఒడిలో పవ్వళించగలిగిన తనయులు అదృష్టవంతులు, జీవన్ముక్తులు, ఆదర్శ వంతులు. ○



## కృష్ణాష్టమి సందేశం :

# త్రిపుటశక్తి - త్రికరణశుద్ధి

శ్రీ సత్యసాయిబాబా

"సహస్ర శీర్షః పురుషాః సహస్రాక్షః సహస్రపాత్" వేలాది శిరములు, వేలాది నేత్రములు వేలాది పాదములు-ఇవన్నియు భగవంతుని అంగములే. ప్రపంచమంతయూ, ప్రతి జీవియూ భగవంతుని ప్రతి బింబములే. ఇట్టి పవిత్రమైన దివ్యత్వము తనయందే ఉన్నదని గుర్తించుకోలేక మానవుడు అనేక విధములైన ప్రయత్నములు సల్పుతున్నాడు. తనయందున్న దివ్యత్వాన్ని మరచి, దైవంకోసం బాహ్యప్రపంచము నందు వెదకటానికి ప్రయత్నిస్తున్నాడు మానవుడు. మానవత్వంలో వుండిన బలహీనత ఇదియే. అవతారములు రెండు విధములు. **1.** అంశావతారము, **2.** పూర్ణావతారము. సమస్త జీవులూ అంశావతారములే. "మమైవాంశో జీవలోకే జీవభూతస్సనాతనః" నా అంశమే సర్వభూతముల యందున్నదని గీతాచార్యుడు చెప్పాడు. అయితే ఈ అంశావతారములు మాయకు లోనై మమత్వమును, అహంతత్వమును అభివృద్ధిపరచుకొని జీవతత్వంతో ఈ జగత్తునందు జీవిస్తున్నారు. పూర్ణావతారములు మాయను వశపరచుకొని, మాయకు అతీతమై తమయొక్క దివ్యత్వమును ప్రపంచమునకు ప్రసరింపజేసే నిమిత్తమై దివ్యత్వముతోనే జీవిస్తూ ఉంటారు. మాయకు బద్ధులైనట్లుగా తాము నటించి, మాయకు ఏమాత్రం సంబంధం లేనటువంటి దివ్యత్వంతో జగత్తును పాలిస్తూ ఉంటారు రామావతారం మాయకు లోబడినట్లుగా నటించి ఈ జగత్ కళ్యాణ నిమిత్తమై ధర్మమును తాను ఆచరించి, అనుభవించి జగత్తుకు అందిస్తూ వచ్చాడు. కృష్ణావతారం అట్లు కాదు. మాయను తన అదీనమునందుంచుకొని కేవలం లీలావతారంగా ప్రవర్తిస్తూ వచ్చాడు. కృష్ణావతారమునందు తనయొక్క తత్వమును ఆచరణయందే కాక ప్రచార ప్రబోధలయందు కూడనూ తన దివ్యత్వాన్ని ప్రపంచానికి అందిస్తూ వచ్చాడు. తాను గుణాతీతుడు. కాని లోకోద్ధరణ నిమిత్తమై తాను గుణములు కలిగినటువంటివానిగా నటించి, తాను ఆచరించి జగత్తును ఆనందపరుస్తూ వచ్చాడు. తాను ఏది చేసినప్పటికినీ, ఏమి చెప్పినప్పటికినీ జగత్తుకు మంచికోసమే చేస్తూ వచ్చాడు.

ప్రేమ అమృతమయము, మధురాతి మధురం. ఇట్టి భక్తిరసప్రభావమును గ్రోలినటువంటివారే గోపికలు. వారు ముక్తినిగాని, జ్ఞానమునుగాని, వైరాగ్యమునుగాని, ఆశించలేదు. భక్తికి మించిన ఆనందం వారికి దేనిలోను కానరాలేదు. దీనినే నారదుడు "పరమభక్తి" అన్నాడు. ఇట్టి పరమభక్తి స్వరూపులైనటువంటి ఆనాటి భక్తులు పరమాత్మ ని సన్నిహితునిగా, పెన్నిధిగా భావించి అనుభవిస్తూ వచ్చారు. ఇట్టి భగవత్ ప్రేమను గ్రోలినటువంటి గోపికలు మత్తులై, ఉన్మత్తులై, ప్రేమోన్మత్తులై పిచ్చివారివలె తిరుగుతూ వచ్చారు. కృష్ణుని మురళిగానము వినినంతనే మైమరచేవారు. భగవంతుడు శబ్దబ్రహ్మస్వరూపుడని గుర్తిస్తూ వచ్చారు, గోపికలు. జగత్తునందు గల సమస్త పదార్థములను విస్మరిస్తూ వచ్చారు. మా పెన్నిధి, సన్నిధి; ఇహము, పరమూ సర్వమూ మాకు కృష్ణుడేనని భావించారు. ఇట్టి ఏకాత్మభావమును వారు అనుభవిస్తూ వచ్చారు. కృష్ణుని వియోగమును సహించలేకపోయేవారు.

"విశ్వం విష్ణుస్వరూపం" సర్వం కూడనూ భగవంతుని స్వరూపంగా భావిస్తు వచ్చారు. ఎక్కడికి

( తరువాయి 9వ పేజీలో )



# అగజానన పద్యార్ఘ్యమ్

-ఆర్. వి. ఎస్. సుబ్బారావు

భిన్నత్వంలో ఏకత్వాన్ని రూపొందించువాడు వినాయకుడు ఒక్కడే. ఏ క్రొత్త పనిని ప్రారంభించు నప్పుడైనా, శాక్తేయులు, వైష్ణవులు, శైవులు అను విచక్షణ లేక అందరూ చేయునది విఘ్నహరుడగు వినాయకుని పూజే (గణపతి).

ఆ పార్వతీ తనయుని సేవించుటవలన భక్తులకు చేకూరునవి "బుద్ధి-సిద్ధు"లనునవి. (వీటిని, వినాయకుని భార్యలుగ ప్రతిపాదింతురు). ఆ బుద్ధి - సిద్ధులు సమకూడిన పిదప కలుగు ఫలములు. "క్షేమము - లాభములు" (వీటిని వినాయకుని సంతానముగ తెలిపెదరు).

పార్వతీదేవి నలుగుతో బొమ్మనుచేసి ప్రాణప్రతిష్ట చేయగా, ముద్దులొలుకు బాలుడుగ, పార్వతీతనయుడుగ రూపొందెను. నలుగుతో చేయబడిన దానికి ప్రతీకగా నేటికిని వినాయకచవితినాడు, మట్టితో చేయబడిన వినాయకుని పూజించుట జరుగుచున్నది.

పార్వతీదేవి వానిని తన మందిరానికి కాపుంచగ లోనికి రానున్న శివుని అడ్డగించి వాని కోపానికిగురియై తన శిరస్సును కోల్పోయెను. తండ్రియొక్క ప్రాముఖ్యతను గమనించలేనివారికి, భగవంతుని ఎదిరించువారికి కలుగు ఫలితమేమో ఈ సంఘటనల వలన తెలియుచున్నది. పార్వతి ప్రార్ధనను మన్నించి, శివుడు ఏనుగు శిరస్సును, వినాయకుని మొండెమునకు సంధించి పునః ప్రాణప్రతిష్టను చేసెను. ఏనుగు తల పెద్దది. అనగా పెద్ద తల అధిక జ్ఞాన సంపదకు చిహ్నం. అందువలన వినాయకుడు మంచి చెడులను తెలిసికొనగలుగు బుద్ధికుశలత గలిగి, జ్ఞానవంతుడై లోకారాధ్యుడైనాడు.

"స్వదేశే పూజ్యతే రాజా, విద్వాన్ సర్వత్ర" అని అన్నారు గదా? తమ కొడుకులగు గజముఖ, షణ్ముఖులలో గణాధిపత్యమునకై పోటీ రాగా, శివుడు ఎవరు ప్రపంచమును చుట్టి (అనగా ప్రదక్షిణము చేసి) ముందుగా తిరిగి వచ్చెదరో వారికే ఆ పదవి లభించునని నియమ మేర్పరిచెను. అనగా శారీరక బుద్ధి బలములకు పోటీ పెట్టెను. వెంటనే షణ్ముఖుడు తన నెమలి వాహనమునెక్కి ప్రపంచమును చుట్టి వచ్చుటకు వేగముగా పయనించెను. వినాయకుడు స్థూలశరీరుడు, మూషికవాహనుడు. కానీ బుద్ధిబలము చేత తల్లిదండ్రుల మహత్యమును గురించి తెలిసికొన్నవాడగుటచే, జగత్తుకే మాతాపితలైన తన తల్లిదండ్రులగు శివ-పార్వతులకు ముమ్మారు ప్రదక్షిణముచేసెను. తల్లిదండ్రులను గౌరవించి, పూజించి,వారికి ప్రదక్షిణం చేసినచో ప్రపంచమునకే ప్రదక్షిణము చేసిన ఫలితము చేకూరునని లోకులకు తెలియపరచెను.

మాతా పితలకు ప్రదక్షిణ చేసిన ఫలితముగా కుమారస్వామి ఎచ్చటికి వెళ్ళినను తనకన్నముందుగా తన అగ్రజుని చూసి అతని గొప్పతనము తెలిసికొని గణాధిపత్యమును అన్నగారికే ఇచ్చుటకు అంగీకరించెను.

గణాధిపతియైన వినాయకునికి భక్తులు, దేవతలు అనేక పదార్థములను నివేదన చేసిరి. అందరిని సంతోషపెట్టు తలంపుతో, అధికముగ నివేదనలు ఆరగించిన గణనాధుడు తల్లిదండ్రులకు సాష్టాంగ నమస్కారము చేయదలచగ, కడుపు నిండిన లంబోదరునకు, కాళ్ళు నేలకానిన తల ఆనలేదు. శిరస్సు వంచినపుడు కాళ్ళుపైకి వెళ్ళినవి. అతని అవస్థను చూచి

శివుని శిరస్సున ఉన్న చంద్రుడు వికటముగా నవ్వెను. వాని దృష్టిదోషమున వినాయకుని ఉదరము విచ్ఛిన్న మయ్యెను. కుమారుని సంకట స్థితికి, కినిసిన పార్వతీ దేవి, చంద్రుని చూచి కోపించి, వానిని చూచినవారు నీలాపనిందలపాలగునట్లు శపించెను. దేవతలు ఆ శాపమునకు భయపడి, ఆమెను అనేక విధముల ప్రార్థించగా ప్రసన్నురాలై, తన కుమారుడు తిరిగి బ్రతికినవాడగుట వలన చంద్రునికిచ్చిన శాపమును, ఆనాటి వరకు అనగా భాద్రపద శుద్ధ చవితి నాటి వరకు మాత్రమే పరిమితం చేసినది.శివుని శిరస్సు అధిష్ఠించినా గొప్పవారిని అవహేళన చేసినచో శాపోపహతులగుదు రని చంద్రుని ప్రవర్తనవల్ల తెలుస్తున్నది.

యుగాలు గడచినవి. దేవతలు, మానవులు ఆ భాద్రపద శుద్ధ చవితినాడు మాత్రము చంద్రుని చూడకుండా జాగ్రత్తపడసాగిరి. కానీ ద్వాపరయుగమున శ్రీకృష్ణుడంతటివానికి కూడా పాలలో చంద్రుని చూచిన దోషమున, శమంతకమణిని అపహరించాడన్న నీలాప నింద తప్పలేదు, కానీ పరమాత్మ అయిన శ్రీకృష్ణుడు శమంతకమణిని తెచ్చి సత్రాజిత్తు కిచ్చి తనమీదపడిన నీలాపనిందను పోగొట్టుకున్నాడు. అందరికీ అలా సాధ్యపడదు కాబట్టి ఆ రోజున ఆ కథను విని అక్షింతలు వేసుకున్నవారికి అపవాదులు రావని శ్రీకృష్ణుడు అనుగ్రహించెను.

గణపతిది ప్రత్యేకమయిన రూపము. ఏనుగు తల నాలుగు చేతులు, మూషిక వాహనము. ఏనుగు జంతువు లలో పెద్దది. ఎంతటి దట్టమైన అడవులలోకి కూడా చొచ్చుకుని పెళ్ళగలదు. అధిక బలము గలిగికూడ సాత్వికమైన జంతువు. ఎంతో ఎత్తు ఉన్నా క్రింద ఉన్న చిన్నవస్తువునిగూడ చూడగల తీక్షణదృష్టి గలది. వినాయకుని చెవులు చేటలవలె పెద్దగా ఉండును. తొండము సదా కదులుచుండును. నాలుగు చేతులలో ఒకదానిలో పాశమును, రెండవ చేతిలో అంకుశము మూడవ చేతిలో మోదకపాత్ర, నాలుగవ చేతిలో అభయముద్ర ధరించియుండును.

కార్యమును మొదలుపెట్టినను ముందుగా పూజించేది గజముఖునే. భక్తితో తనను కొలిచినవారి విఘ్నాలను తొలగించుతాడు విఘ్నేశ్వరుడు. తనను ఆరాధించు ఎంతటి అల్పప్రాణినైనను ఆశీర్వదించుతాడు ఉమాసుతుడు. చేటలవలె ఉన్న తన పెద్ద చెవులతో మానవునిలోని దుష్టసంకల్పాలను దూరంచేసి సజ్జనులను చేస్తాడు శివకుమారుడు. మొదటి చేతిలో నున్న పాశముతో భక్తుల మనస్సులను ఆకర్షించి బంధించు తాడు. రెండవ చేతిలో నున్న అంకుశముతో వారి అజ్ఞానమును పోగొట్టుతాడు. మూడవ చేతిలోని మోదకము (కుడుములు)లతో భక్తుల కోర్కెలను తీరుస్తాడు. తనను శరణన్నవారికి భయము లేదని నాలుగవ చేతితో అభయముద్రను ప్రసాదిస్తాడు. స్తబ్ధత సోమరితనాలు కూడదని సదా చైతన్యవంతులై ఉండా లని తన తొండమును ఎప్పుడూ కదిలిస్తుంటాడు. భిన్నత్వంలో ఏకత్వం బోధిస్తాడు ఏకదంతుడు. పంచమ వేదమైన మహాభారతమును వ్యాసుడు చెప్పగా ఘంటము ఆపకుండా వ్రాశాడు ఉమాసుతుడు.

బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుల సమైక్యాలా అన్నట్లు తనను ఆరాధించు వైష్ణవులు, శైవులు, శాక్తేయులు మొదలగు విభిన్న భావాలు కలవారినికూడా తన ఏక దంతంతో వారిలోని అజ్ఞానాన్ని తొలగించి, జ్ఞాన జ్యోతిని వెలిగించుతాడు అపరాసుతుడు. ఇట్టి సద్గుణ సంపన్నుడైన గణపతిని భాద్రపద శుద్ధ చవితినాడు మనము అనేక రకములైన పత్రి, పూలతో పూజించుతాము.

ఆ రోజు గణపతి గణాధిపత్యం వహించిన రోజు. లంబోదరుని పూజించుటకు కుల, మత, భాషా, వయో భేదములు లేవు. సర్వులకు పూజనీయుడు, లోకారాధ్యుడు గణేశ్వరుడు.

-o-

 

# క్ష ్ర దా న



ఈ నక్షత్ర దాన మహిమాతిశయ నిరూపణము కీ॥ శే॥ శ్రీ వాజపేయయాజుల రామ సుబ్బారాయుడు B. A. గారు రచించిన 'ప్రసన్న భారతము' లోని అనుశాసన పర్వము నుండి గైకొనబడినది. వీరు జడప్రోలు సంస్థాన ఆస్థానకవి, శతాధిక గ్రంథకర్త, విద్యాధికారి, స్నేహలతా కవితా సంఘాధ్యక్షులు. వీరిది మహబూబ్ నగర్ జిల్లా కొల్లాపురం. వారి సుపుత్రులు శ్రీ రవికుమార్ గారి అనుమతితో ఈ 'నక్షత్ర దానము' ను "శ్రీవాణి" లో పాఠకులకు అందించుచున్నాము.

—సం.

1. కృత్తికా నక్షత్రము :- ఈ నక్షత్రమున జన్మించినవారలు నెయ్యి, పాయసము దానము చేయ వలెను. దానివలన, దాత సర్వోత్తమమగు లోకమును పొందును.

2. రోహిణీ నక్షత్రము :- ఈ నక్షత్రమున జన్మించినవారలు మృగ మాంసముతో, నెయ్యి, పాయసము దానము చేసిన బ్రాహ్మణ ఋణము తీర్చిన వాడగును.

3. మృగశిర నక్షత్రము :- ఈ నక్షత్రమున జన్మించినవారలు వత్సముతో గూడిన పాడియావు యిచ్చిన స్వర్గలోకము వచ్చును.

4. ఆర్ద్రా నక్షత్రము :- ఈ నక్షత్రమున జన్మించినవారలు నువ్వులు, బెల్లముతో చేసిన "పులగము" బ్రాహ్మణునకు దానము యిచ్చినవాడు దుర్గమ ప్రదేశమును దాటగలడు,

5. పునర్వసు నక్షత్రము :- ఈ నక్షత్రమున జన్మించినవారలు అప్పములతో బ్రాహ్మణునకు అన్నము పెట్టిన కీర్తి గాంచును.

6. పుష్యమి నక్షత్రము :- ఈ నక్షత్రమున జన్మించినవారలు సువర్ణ దానమిచ్చిన ఉత్తమ లోకము వచ్చును.

7. ఆశ్లేష నక్షత్రము :- ఈ నక్షత్రమున జన్మించినవారలు వెండి దానముకాని, వృషభమునుకాని బ్రాహ్మణునకు దానము నిచ్చినచో సర్వభయము తొలగును.

8. మఘ నక్షత్రము :- ఈ నక్షత్రమున జన్మించినవారలు బ్రాహ్మణునకు తిల దానము చేసినచో యిహమునందు పుత్ర, పశు సమృద్ధి కలుగును.

9. పుబ్బ నక్షత్రము :- ఈ నక్షత్రమున జన్మించినవారలు బ్రాహ్మణునకు భక్ష్యములు దానముగా ఇచ్చినచో వాడు సౌభాగ్యమును పొందును.

10. ఉత్తర నక్షత్రము :- ఈ నక్షత్రమునందు జన్మించినవారలు ఘృత, క్షీర, సమాయుక్తమగు అన్నము పెట్టినచో స్వర్గము వచ్చును.

11. హస్త నక్షత్రము :- ఈ నక్షత్రమునందు జన్మించినవారలు ఏనుగుతో కూడిన రథమిచ్చినచో పరమ పుణ్యలోకము కల్గును.

12. చిత్తా నక్షత్రము :- ఈ నక్షత్రమునందు జన్మించినవారలు దివ్యమైన పుష్పములు, గంధము - బ్రాహ్మణునకు దానము యివ్వవలెను. వృషభ దానము కూడ ఇచ్చినచో నందనవన - నివాసము పొందగలడు.

మనశ్శాంతి కనుక నీకు కావాలంటే ఇతరులను నిందించకు. నీ తప్పులేమిటో నీవు తెలిసికో. అఖిల ప్రపంచాన్ని నీదిగా చేసికో పరాయివారంటూ ఎవ్వరూ లేరు. ఈ ప్రపంచమంతా నీదే.

శ్రీ శారదాదేవి

---

13. స్వాతి నక్షత్రము :- ఈ నక్షత్రమునందు జన్మించినవారలు ఇష్టమగు ధనమును బ్రాహ్మణులకు దానము చేసిన - శుభప్రదమగు లోకము వచ్చును.

14. విశాఖ నక్షత్రము :- ఈ నక్షత్రమునందు జన్మించినవారలు ధేనువు, శకట - ధాన్యములు పితృ ప్రీతిగా యిచ్చిన దినము వచ్చును.

15. అనూరాధ నక్షత్రము :- ఈ నక్షత్రము నందు జన్మించినవారలు వస్త్రదానము, అన్నదానము - చేసినచో నూరు యుగములు స్వర్గలోకమున మహత్తరుఁడై వెలుగును.

16. జ్యేష్ఠ నక్షత్రము :- ఈ నక్షత్రమునందు జన్మించినవారలు కర్వేపాకుతో కూడిన కందమూల ఫలము లిచ్చిన వర్ధిల్లును.

17. మూల నక్షత్రము :- ఈ నక్షత్రమునందు జన్మించినవారలు కందమూల ఫలములు యిచ్చినచో పితృదేవతలకు ప్రియ మొనర్చినవాఁడై యిష్టగతి నొందును.

18. పూర్వాషాఢ నక్షత్రము :- ఈ నక్షత్రము నందు జన్మించినవారలు దధిపాత్రను వేద వేత్తయగు బ్రాహ్మణున కిచ్చిన బహు గో, ధన - సమన్వితమగు సద్వంశమున జన్మించును.

19. ఉత్తరాషాఢ నక్షత్రము:- ఈ నక్షత్రము నందు జన్మించినవారలు నెయ్యి, పేలపిండి, ఉదక కుంభము - యిచ్చిన సకల కామములు పొందగలడు.

20. అభిజిత్తు నక్షత్రము :- ఈ నక్షత్రము నందు జన్మించినవారలు మధు, ఘృత - పృతంబగు దుగ్ధము దానము చేసిన స్వర్గలోకవాసము కల్గును.

21. శ్రవణా నక్షత్రము :- ఈ నక్షత్రము నందు జన్మించినవారలు "కంబళి" దానము చేసిన స్వర్గలోకప్రాప్తి యగును.

22. ధనిష్ఠ నక్షత్రము :- ఈ నక్షత్రమునందు జన్మించినవారలు వృషభ - శకటములు యిచ్చిన ఉత్తమ పదము లభించును.

23. శతభిష నక్షత్రము :- ఈ నక్షత్రము నందు జన్మించినవారలు అగరు చందన గంధంబు - దానము చేసిన శాశ్వత సుఖము కలుగును.

24. పూర్వాభాద్ర నక్షత్రము :- ఈ నక్షత్రము నందు జన్మించినవారలు "అనుములు" దాన మిచ్చిన సకల భక్ష్య దాన ఫలము కలుగును.

25. ఉత్తరాభాద్ర నక్షత్రము :- ఈ నక్షత్రమునందు జన్మించినవారలు గొరియ మాంసమిచ్చిన పితృదేవతలు తరింతురు - అనంత సుఖము కల్గును.

26. రేవతీ నక్షత్రము :- ఈ నక్షత్రమునందు జన్మించినవారలు కాంస్య పాత్ర నిండా పాలనిచ్చుకో వలెను - (ధేనువు పాలు) ఈ దానము వలన వలయు సుఖములు లభించును.

27. అశ్వినీ నక్షత్రము :- ఈ నక్షత్రమునందు జన్మించినవారలు "అశ్వయుక్తరథంబు" దానము చేసిన సద్వంశంబున జననము సిద్ధించును.

28. భరణీ నక్షత్రము :- ఈ నక్షత్రమునందు జన్మించినవారలు తిలలు, ధేనువు - దానము చేసిన ఊర్ధ్వలోకంబుల అపూర్వ సంపత్సమేతుండై పెంపొందును.

"ఈ నక్షత్ర దానమహిమ" - నారదుడు దేవకీ దేవికి చెప్పగా ఆ విషయము ఆమె తన కోడండ్రకు చెప్పెనని భీష్ముఁడు ధర్మరాజునకు చెప్పెను.

శ్రీం

# కృష్ణాష్టమి సందేశం

( 4వ పేజీ తరువాయి )

పోయినా కృష్ణుడెక్కడ? కృష్ణుడెక్కడ? అనే భావం తప్ప అన్యభావం వారిలో ఏమాత్రం కనిపించేది కాదు. సర్వకాల సర్వావస్థలయందు కృష్ణుని రూపురేఖలు, మధురమైనటువంటి ప్రేమ తప్ప అన్యము వారు ఆశించలేదు, అన్వేషించలేదు. భక్తిప్రపత్తులు కలిగినటువంటి వారి మనస్సు దైవ పాదపద్మములపై తప్ప అన్యప్రదేశములవైపు అది పోదు. ఇట్టి పవిత్రమైన చిత్తము కలిగినవారే గోపికలు. కృష్ణుని ఆనందామృతాన్ని గ్రోలిన గోపికలు, కృష్ణుని అనురాగమునకు పాత్రులైన గోపికలు, కృష్ణుని ఆత్మాన్వేషణకు అరువులు జాచిన గోపికలు అన్యమును ఏమాత్రం వారు ఆశించలేదు. కనుకనే క్షణక్షణము గోపికల ఇండ్లకే పరుగెత్తేవాడు కృష్ణుడు. గోపికల ఇండ్ల నుండి అపహరించే వెన్న వెన్న కాదది. అది గోపికలయొక్క హృదయాలే. Butter అనగా పవిత్రమైనటువంటిది, నిర్మలమైనటువంటిది, సున్నితమైనటువంటిది. ఇలాంటి హృదయము గోపికల హృదయము.

త్రేతాయుగమందు సత్యధర్మస్వరూపుడై శ్రీరాముడు అవతరించాడు. ద్వాపరయుగమునందు శాంతి ప్రేమ స్వరూపుడై శ్రీకృష్ణుడు అవతరించాడు. నేడు సత్య ధర్మ శాంతి ప్రేమ స్వరూపాన్ని నాల్గింటిని సమ్మిళితం గావించుకొని అవతరించడం జరిగింది. ఈ ప్రేమతత్త్వమనే దానిని ప్రపంచం అంత సులభంగా అర్థంచేసుకోలేదు. మానవత్వమును ప్రకృతి ద్వారా కొంత వేరుచేసి దివ్యత్వంలో ప్రవేశించినప్పుడే ఈ శాంతి సహన ప్రేమతత్త్వములు మనకు అలవడుతాయి. ప్రేమను ప్రేమ ద్వారానే పొందడానికి వీలవుతుంది. అన్యమార్గంలో ఇది అలవికాదు. కనుక దివ్యత్వాన్ని పొందగోరినవారు పరమ పవిత్రమైన ప్రేమను అలవరచుకోవాలి. ఈ ప్రేమ ఒక దైవస్వరూపం. దీనికి ఫలాపేక్ష లేదు. దైవాపేక్ష తప్ప అన్యాపేక్ష దీనికి లేదు. ధర్మాన్ని సంరక్షించే నిమిత్తమై భగవంతుడు అవతరిస్తున్నాడు. ప్రతి మానవుడుకూడను ధర్మాన్ని ఆచరించే నిమిత్తమై అవతరిస్తున్నాడు. దేహం ధర్మ నిమిత్తమై వచ్చినటువంటిదే. "శరీర మాద్యం ఖలు ధర్మ సాధకం" ధర్మసాధన నిమిత్తమై ఈ శరీరమొచ్చినది. అయితే ఇక్కడ మనం ఒక్క విషయాన్ని చక్కగా గుర్తించవలసివున్నది. ధర్మ రక్షణ కంటె పూర్వం దేహ రక్షణ అత్యవసరంగా భావించేవారు. దేహ రక్షణ గావించుకున్నప్పుడే, ఈ దేహం ద్వారా ధర్మరక్షణ సల్పవచ్చు. కనుక దేహ రక్షణ ప్రతి మానవునకూ అత్యవసరం. దీనిని పురస్కరించుకొనే Health is Welth ( ఆరోగ్యమే మహాభాగ్యము ) అన్నారు. అయితే ఈ దేహరక్షణ దేనికోసం? లౌకికమైన భోగభాగ్యములను సంపాదించడం కోసం కాదు. ధర్మాన్ని రక్షించడంకోసం. అయితే ధర్మమంటే ఏమిటి? మనసునందు ఆవిర్భవించినటువంటి అభీష్టమును, వాక్కునందు ప్రచురింపజేసి, వాక్కునందు ప్రచురింపజేసినటువంటి ధర్మమును క్రియారూపంలో మనం ప్రపంచానికి నిరూపించాలి. మనసు మాట క్రియయు మనిషికి ఒక్కటియైన - అదియే నిజమైన మానవత్వం. మనసునందు వేరు మాటయు క్రియయు వేరు, వేరు అయిన విధమినేమి! ఈనాటి మానవత్వమునందు ఇట్టి "త్రిపుటశక్తి" మనకు లభించాలి. ధర్మము ఏనాటికి నశించునదికాదు, ధర్మాచరణ మాత్రమే క్షీణిస్తూ వస్తుంది. కనుక ఈనాడు మనం ధర్మమును ఆచరించటానికి తగిన కృషి చేయాలి. అదియే నిజమైన సాధన. సాధన అనగా కేవలం ఏదో జపం, ధ్యానం, యోగం కాదు. ఇవన్నియూ కాలమును సార్థకం గావించుకునే నిమిత్తం ఏర్పడినటువంటివే. జన్మ సార్థకతకోసమై ఈ "త్రికరణశుద్ధి" అత్యవసరం.

కృష్ణ జననమనగా కేవలం ఏదో! ఎప్పుడో! ద్వాపరయుగంలో పుట్టాడని, ప్రబోధనలు సలిపాడని

భావించరాదు. క్షణక్షణమందు ప్రతి ఒక్కరి హృదయమందునూ ఆ కృష్ణభావమును నిరంతరమూ పోషిస్తు రావాలి. కృష్ణ అనగా ఏమిటి? ఎప్పుడు పుట్టాడు? శ్రావణమాసం, కృష్ణపక్షం, అష్టమి తిథి. చీకటి ఇంటిలో చీకటిగా (నల్లగా) వుండే కృష్ణుడు పుట్టాడు. శ్రావణమనగా నేమిటి? శ్రవణమునకు ఆనందం కలిగించునది. భగవంతుని పొందటానికి నవవిధ మార్గము (శ్రవణం, కీర్తనం, విష్ణుస్మరణం, పాదసేవనం, వందనం, అర్చనం, దాస్యం, స్నేహం, ఆత్మనివేదనం) లలో "శ్రవణం" మొట్టమొదటిది. కట్టకడపటిది "ఆత్మనివేదనం". శ్రవణం చేతనే ఆత్మనివేదనమునకు తగినటువంటి అర్హతను పొందగలుగుతాం. కాని దురదృష్టవశాత్తు ఈనాడు లోక సంబంధమైన, అశుభమైన, అశాంతిని కలిగించేటటువంటివాటినే శ్రవణం చేస్తున్నామేకాని సత్యమైన, నిత్యమైన, మధురమైన, అమృతమైన విషయాలను శ్రవణం చేయటానికి సిద్ధముగా లేము. ఇతరుల యొక్క తప్పొప్పులను గురించిన విషయాలనే మనం శ్రవణం చేస్తున్నామేకాని పవిత్రమైన, దివ్యనామాన్ని శ్రవణం చేయటానికి తగిన కృషి చేయటంలేదు.

ఈ ప్రపంచంలో సంసారమే ఒక పెద్ద సముద్రం. మన ఆశలే అలలు. ఇందులో రాగద్వేషములనే మొసళ్లు, తిమింగలాలు ఉన్నాయి. దీనిలో తిరిగి సామాన్యమైన మానవులు భరించుకోవటం బహుకష్టం. ఒక్క నీ నామమే సర్వమునూ రక్షిస్తుంది అన్నారు గోపికలు. గోపికల భక్తిని కేవలం ఏదో ప్రాకృతమైన విషయవాసనలుగా మనం భావిస్తున్నాం. అది చాలా పొరపాటు. వారి చిత్తములు ఎట్టి విషయముల యందునూ ప్రవేశించెడివి కాదు. విషయ వాసనలు వారికి అత్యంత దూరం. దైవమే వారికి సన్నిహితం. ఈ విశ్వమంతయూ వారు విష్ణు స్వరూపంగా భావించుకున్నారు. కనుక మనం దివ్యత్వాన్ని దర్శించాలంటే ఎక్కడికో పోనక్కరలేదు. మన దృష్టి అంతర్ముఖం గావించుకున్నప్పుడే, అక్కడే మనకు దివ్యానందం ఆవిర్భవిస్తుంది.

గోపికలు సగుణ నిర్గుణములను ఏ మాత్రం విశ్వసించక సాకారమును మాత్రమే వారు ఆశిస్తు వచ్చారు. సాకారము లేక నిరాకారము సాధ్యము కాదు కనుక మాకు సాకారమే కావాలన్నారు. ఈ సాకారంలో మా ఆకారం లీనమైపోవాలని భావించారు. అదే మా దృష్టిలో నిరాకారమన్నారు గోపికలు. మా ఆకారాన్ని మరవడమే నిరాకారమవుతుంది. మా ఆకారంపైననే లక్ష్యం పెట్టుకొని నిన్ను నిరాకారంగా చూడాలంటే ఇది సాధ్యమవుతుందా? కనుక మా ఆకారాన్ని మేము మరువడమే అదే నిరాకారము. కేవలం జప తప ధ్యానాదులవల్ల దైవత్వం లభ్యమవుతుందనుకోవటం అది ఒక భ్రాంతి. అవి కొంతవరకు శాంతిని చేకూర్చవచ్చు. నిత్యశాంతి, నిత్యానందం మనకు లభ్యం కావాలంటే మనయందున్న దివ్యభావాన్ని మనం అభివృద్ధిపరచుకోవాలి. దానికి తగినటువంటి వాతావరణాన్ని కూడా ఏర్పర్చుకోవాలి. అందుకోసమే మన పూర్వీకులు అరణ్యాలకు వెళ్ళి ఏకాంత స్థానంలో కూర్చొని తపస్సు చేసేవారు. మనం ఇప్పుడు అడవులకు పోనక్కరలేదు. మన హృదయమందున్న దివ్యాత్మ తత్వాన్ని మనం గుర్తించాలి. ఈనాడు నీవు అడవికి వెళ్ళి కూర్చున్నా నీ బుద్ధి వచ్చి ఊళ్ళో సంచరించవచ్చు. కనుక అది Forest (అడవి). ఇది Far-rest (విశ్రాంతికి దూరం). అదే నీ హృదయం. నీయొక్క శాంతి నీయందే వున్నదిగాని బయట లేదు. ఇట్టి పవిత్రమైన సన్నిధియందు ఈ వాతావరణముయందు మరింతగా ఈ శాంతిని అభివృద్ధి చేసుకొనవచ్చు.

అవతారములయొక్క తత్వమందు సులభమైన మార్గము, మధురమైన అనుభూతులు ఒక్క కృష్ణావతారం యందు మాత్రమే కనిపిస్తూ వచ్చాయి. అట్లని మిగతా అవతారములు తక్కువని భావించరాదు. ఆయా పరిస్థితులనుబట్టి ఆ విధంగా అవతరించి మార్గదర్శకం

చేశారు. త్రేతాయుగంలో ధరణీ, ధర్మపత్ని, ధర్మము- ఈ మూడింటిని ఉద్ధరించే నిమిత్తమై రామావతారం వచ్చింది. కాని కృష్ణావతారం సమయానికి రాక్షసత్వం మరింత అధికమైంది. ధరణి, ధర్మపత్నిని కాక కేవలం ధర్మాన్ని రక్షించడానికే ఈ అవతారం వచ్చింది. ధర్మమును ఉద్ధరించినపుడు ధరణి, ధర్మపత్ని రెండూ ఉద్ధరించబడతాయి గదా! మాయామానుష విగ్రహుడు రాముడు. లీలామానుష విగ్రహుడు కృష్ణుడు. రాముడు కేవలం మాయకు బద్ధుడైనట్లుగాను, ధర్మపత్ని నిమిత్తమై విలపించినట్లుగా కనిపిస్తుంది. కృష్ణావతారం అట్లుకాదు. తన నిమిత్తమై స్త్రీలు విలపించినట్లుగాను కనిపిస్తుంది. కాలు త్రొక్కించుకొని కయ్యానికి పూనుకున్నాడు రాముడు. కాని కృష్ణుడు అట్లా కాదు. కాలు త్రొక్కి కయ్యాన్ని తెచ్చుకున్నాడు. రామావతారం మొదట పని తరువాత నవ్వు. కృష్ణావతారం అట్లు కాదు. మొదట నవ్వు, తరువాత పని. ఈవిధంగా చూస్తే లీలావతారమునకు, మాయావతారమునకు ఉండినటువంటి వ్యత్యాసం బోధపడుతుంది. కృష్ణుడు ఎల్లప్పుడు ఆనందంగానే ఉండేవాడు. రుద్రభూమి, భద్రభూమి, యుద్ధభూమి అన్నిటియందునూ ఆనందంగానే ఉన్నాడు. యుద్ధభూమిలో ఇరుసేనల మధ్య నిలుచొని "గీతాగానం" చేశాడు. ఉల్లాసంగా వుండినప్పుడే ఎవరైనా పాట పాడగలుగుతారు. పాట పాడటానికి ఆనందమే కారణం. కృష్ణుడు ఆనందమయుడు కాబట్టి యుద్ధభూమిలో కూడా గానం చేయగలిగాడు. దివ్యత్వం అనేది ఆనందంలోనే ఉంటుంది. మీకు తెలుసునో, లేదో! స్వామియొక్క తత్త్వము. "స్వామీ! నాకు కడుపునొప్పి, చాలా ఎక్కువగా ఉంది. నేను భరించుకోలేను" అని ఎవరైనా అంటే ఆనందం! ఆనందం! అంటాను. "స్వామీ! మాకు కష్టాల వెంబడి కష్టాలు వస్తున్నాయి" అంటే చాలా సంతోషం అంటాను. నాకు ఎల్లప్పుడూ సంతోషమే. సంతోషం అనేది దివ్యమైనటువంటి స్వభావం. ప్రతిదానికి ఏడుస్తుంటే వచ్చే ఫలితమేముంటుంది? ఇవన్నీ కదిలిపోయే మేఘాలే. ఒక్కటైనా స్థిరమైనటువంటిది లేదు. కనుక దేనికీ విచారించవలసిన అవసరంలేదు, విచారించకూడదు. ఇవియే అవతారముయొక్క ప్రబోధలు. ఏదైనా బాధ కలిగింది. దీని తరువాత సుఖముంటుంది. Pleasure is an interval between two pains. తరువాత మళ్ళీ ఆనందం వస్తుంది. ఒకదానితరువాత ఒకటి వస్తుంటాయి, పోతుంటాయి. ఈ విశ్వాసంతోనే మన జీవితాలు సాగిస్తూ పోవాలి. దివ్యమైన ఆనందమునకును, క్షణికమైన సంతోషమునకునూ చాలా వ్యత్యాసం ఉంటుంది. మనం భావించే Happy (సంతోషం) అనునటువంటిది శాశ్వతం కాదు. ఆనందం (Bliss) అనేది శాశ్వతమైనది. అది హృదయానికి సంబంధించినది. సంతోషం తాత్కాలికమైన తృప్తినిస్తుంది కాని శాశ్వతమైన ఆనందమును యివ్వదు. కనుక శాశ్వత

### పుట్టపర్తిలో

## ఆంజనేయస్వామి

ఈ సంచిక కవరుపేజీ మీద భగవాన్ బాబా తన అరచేతిలో ఏదో చూపిస్తున్నట్లుగా ఫొటో ఉంది. స్వామి అరచేతిలో ఉన్నది 3.5 అం. ఆంజనేయస్వామి విగ్రహం. హిల్ వ్యూ స్టేడియం ప్రక్కన నున్న కొండమీద 65 అ. ఎత్తు గల ఆంజనేయస్వామి విగ్రహము రూపురేఖలు దిద్దుకుంటున్నది. దీనికి భగవాన్ బాబా ది 19-2-1990 న శంకుస్థాపన చేస్తూ ఆంజనేయ స్వామి విగ్రహం ఎలా వుండాలో శిల్పికి వివరిస్తూ సంజీవినీ పర్వతాన్ని ఎత్తుకొనివస్తున్న ఆంజనేయ విగ్రహమును తన దివ్యశక్తిచేత సృష్టించి శిల్పికి అందజేసారు. అదే నమూనాలో శిల్పి ఆంజనేయ స్వామి విగ్రహమును తయారుచేస్తున్నాడు. స్వామి 65వ జన్మదినోత్సవ సమయానికి ఆంజనేయస్వామి లక్షలాదిమంది భక్తులకు దర్శనమిస్తారు. స్వామి మహిమాన్వితశక్తి అపారం. దేనినైనా సృష్టించగలరు, రక్షించగలరు. -సం.

మైన ఆనందంకోసం ప్రాకులాడండి. అది ఒక్క దైవం ద్వారా తప్ప అన్యమార్గంలో మనకు లభ్యం కాదు. దివ్యమైన ఆనందాన్ని అందించే నిమిత్తమై అవతారములు రావటం జరుగుతున్నది. ఈ కష్టములు, నష్టములు, దుఃఖములు, విచారములన్నీ కేవలం అల్పమైనటువంటివి. ఇవన్నియూ ఒక్క ప్రేమలోనే చేరిపోతాయి. ఒక్క ప్రేమను మీరు పొందినారా! దుఃఖ నివారణ జరుగుతుంది. కనుక దైవానుగ్రహం కోసం మీరు పాటుపడండి.

"యత్ర యోగేశ్వరః కృష్ణో" ... ఎవరి హృదయమునందు యోగేశ్వరుడైన కృష్ణుడుంటున్నాడో ఎక్కడ ధైర్యము విశ్వాసములుంటాయో, అక్కడే అన్ని సౌభాగ్యములు, విజయాలు మనకు లభ్యమవుతాయని భగవద్గీత అంత్య శ్లోకము మనకు బోధిస్తున్నది. "కృష్ణా" అంటే ఏమిటో విచారిద్దాం. ఇది మూడు విధములైన అర్థాల్ని ప్రబోధిస్తూ వచ్చింది. 1. కృషి తీతి కృష్ణః కృషి అనగా వ్యవసాయం చేయడం. దేనిని వ్యవసాయం చేయాలి? కృష్ణుడు మన హృదయమనే క్షేత్రాన్ని వ్యవసాయం చేస్తున్నాడు. పనికిరాని మొక్కలనేటటువంటి చెడ్డ భావాలను పెరికి పారవేస్తున్నాడు. ప్రేమ అనేటటువంటి జలమును పెట్టి దీనిని చక్కగా మెత్తపరుస్తున్నాడు. సాధనా అనే నాగలితో దీనిని దున్నుతున్నాడు. భగవత్ నామమనేదానిని దీనిలో నాటుతున్నాడు. ఈ విధంగా మన హృదయక్షేత్రాన్ని చక్కగా వ్యవసాయం చేస్తున్నాడు కృష్ణుడు. 2. కర్ష తీతి కృష్ణః ఇది రెండవ అర్థం. "కర్ష" అనగా ఆకర్షించేటటువంటివాడు. దేనితో ఆకర్షిస్తాడు? తన మాటలతో, చేతలతో, తన మురళితో ఆకర్షిస్తాడు. తన మాటలతో క్రోధంతో నిండిన హృదయాన్నికూడా చల్లపరుస్తాడు, హాస్యం చేస్తాడు. అన్నీ ఆకర్షణలే కృష్ణుడివి. అదే అతని ప్రత్యేకత. 3. కుష్ తీతి కృష్ణః ఇది మూడవ అర్థం. "కుష్" అనగా కుషీగా అనగా ఉల్లాసంగా ఉండేటటువంటివాడు. కృష్ణుడు నిరంతరం ఉల్లాసంతో ఉట్టిపడేవాడు. కనుక ఇటువంటి విశిష్టమైన గుణములు గల్గిన తత్త్వముగనుక అతనికి గర్గుడు "కృష్ణా" అని పేరు పెట్టాడు. "కృష్ణా" అంటే నల్లది. ఆ నల్లదాన్ని పట్టుకొనే మనం ప్రేళ్లాడుతున్నాముగాని, అసలైన యదార్థమైన నిజార్థాలను, అంతరార్థాలను మనం ఏమాత్రం విచారించటంలేదు.

మొట్టమొదట మీలో నమ్మకం కావాలి. మీ మీద నమ్మకం ఉండటమే దైవం మీద నమ్మకం ఉండటమన్నమాట. తనను తాను నమ్మనివాడు దైవాన్ని నమ్మలేడు. తనపైన తనకు నమ్మకం లేకపోవడం చేతనే యశోద కృష్ణుని నమ్మలేకపోయింది. కృష్ణుడు మన్ను తిన్నాడని బలరాముడు చెప్పగా నోరు తెరవమని చెప్పింది. మన్ను తినలేదని ఎంత చెప్పినా యశోద వినలేదు. కృష్ణుడు నోరు తెరచి చూపిస్తాడు. నోటిలో అన్ని లోకములు కనిపించుతాయి. యశోద నమ్మలేకపోతుంది. అసలు నేను యశోదను కాదా? అవునా? అనే అనుమానం వేస్తుంది. దీనికి కారణం ఏమిటి? లోకసంబంధమైన వాత్సల్యమే దీనికి కారణం. ఇతను నా కొడుకు, నేను తల్లిని అనేటటువంటి శారీరక సంబంధాన్ని పోల్చుకుంటూ వచ్చింది యశోద. కృష్ణుని చరిత్ర కడు విచిత్రమైనది. అసలు అవతారములే విచిత్రములు. దానిని తెలుసుకోలేకపోవడం మరింత విచిత్రము. దానిని అనుభవించలేకపోవడం ఇంకా విచిత్రము. సన్నిధియందే వుంటుండి దుఃఖమును అనుభవించుట మరింత విచిత్రము. మోకాళ్ళలోతు నీళ్ళలో నిలుచుని దాహం! దాహం! అంటూ ప్రాణం విడిచాడుట ఒకాయన. అదే విధముగానే అవతారముల దగ్గరనే ఉంటుండి, అవతారములతో సంచరిస్తు, అవతారములతోనే తిరుగుతూ, ఆడుతూ పాడుతూ అవతార తత్త్వాన్ని అర్థం చేసుకొనకపోవడం అదే ఒక విచిత్రం. అర్థం చేసుకున్నప్పుడే ఆనందం మనకు లభ్యమవుతుంది. మానవత్వం అనేది చాలా పవిత్రమైన జీవితం. నిజంగా భగవత్ విశ్వాసంతో ఉండినప్పుడు జీవితమంతా జైత్రయాత్రగా ఉంటుంది.

( 14-8-90 కృష్ణాష్టమి సందేశం ) ◯

# నారద భక్తిసూత్రాలు-3



# లక్షణావళి



## 15 సూ. తల్లక్షణాని వాచ్యన్తే నానా మత భేదాత్

మహాత్ములు భక్తితత్త్వం తెలుసుకున్నారు. వారి ఉపాసనా పద్ధతులు విశ్వాసాలు అభిప్రాయాలు అనేకం. వారు భక్తిలక్షణాలను తమ తమ దృక్పథాలనుబట్టి వివిధ విధాలుగా వివరించారు.

ఒక్కొక్క మహాభక్తుని అనుభవం ఒక్కొక్క విధంగా ఉంటుంది. వారు తమ అనుభూతినిబట్టి భక్తి అంటే ఇది - ఇలా ఉంటే భగవద్దర్శనం లభిస్తుంది- అని నిర్ణయించారు. వారు ఆ విధంగా కైవల్యం పొందారు.

భక్తితత్త్వం గూర్చి భక్తిలక్షణాలను గూర్చి చాలా మంది మహర్షులు ఎన్నో సంవత్సరాలు తపస్సు చేసి అనుభవజ్ఞానంతో వివరించారు. భక్తి సగుణ నిర్గుణ ఉపాసనా పద్ధతులలో శాఖోపశాఖలుగా విస్తరించి ఉంది.

అది సగుణ ధ్యానమనన్
సదమలగుణ! వినుము నిర్గుణధ్యానమనన్
విదితముగ నిరుతెరంగులు
మొదలిటియదిసేయ నితరమును లభించున్

## 16 సూ. పూజాదిష్వనురాగ ఇతి పారాశర్యః

భగవంతుని పూజాదులు అనురాగంతో ఆసక్తితో చేయటమే భక్తి అని వ్యాసమహర్షి అభిమతం.

విష్ణుపూజ మూడురకాలు - వైదికం, తాంత్రికం, మిశ్రమం. ఇందులో మళ్ళీ బాహ్యపూజ మానసికపూజ అని రెండు విధాలు. దీనినే సగుణారాధన నిర్గుణారాధన అనీ సాకార నిరాకార ఆరాధనలనీ అంటారు.

సగుణారాధనను మూర్తిపూజ అనీ, విగ్రహారాధన అని కూడా అంటారు.

ఇందు భక్తులు దారులోహ శిలా నిర్మిత సుందరతమమైన విగ్రహాలను శ్రీ చక్రాది యంత్రాలపై ప్రతిష్ఠించుకొని అర్చిస్తారు. ఆ ప్రతిమలను సజీవ మూర్తులుగా భావనచేసి నవవిధ భక్తి పద్ధతులతోనే కాక మధుర వాత్సల్య భక్తులతోకూడ పూజిస్తారు.

---

**'శాంతిశ్రీ' జంధ్యాల వేంకటేశ్వరశా**

హేమధ్వనుడు సతీసమేతంగా చంద్రశేఖర పూజ గావించిన విధం ఇది -

చంద్రకాంతోపలస్వచ్ఛ వేదీస్థలుల్
కలి జవ్వాజితో కలియనలికి
అనువుగా క్రొత్తకట్టాణిముత్తియముల
నిగ్గులు వెదచల్ల ముగ్గుపెట్టి
అర్ఘ్యోదకంబుల నభిషేక మొనరించి
రమణీయ రత్న పీఠముననునిచి
మృగమద పంకంబు మేననిండ నలంది
మేలేర్చి క్రొవ్విరుక్ గీలు కొలిపి
ధూప మర్పించి కర్పూర దీప మొసగి
అమృత దివ్యాన్న రుచిరోపహారమిచ్చి
వనితయునుదాను సాష్టాంగ వినతిజేసి
చంద్రధరుగొల్చు నా రాజచంద్రు డెపుడు

అలికి ముగ్గుపెట్టి ఆ పవిత్ర పీఠంపై మూర్తిని నెలకొల్పాలి. అర్ఘ్యపాద్యాలిచ్చి షోడశోపచారాలలో పూజించాలి. మనస్సులో చక్కని భావన చేయాలి.

ఈ అర్చనలో రెండు విధానాలున్నాయి. ఒకటి అమూర్తార్చనం, రెండోది సమూర్తార్చనం. అగ్నిలో హవ్యాదులు ఆహుతి చేయటం అమూర్తార్చన - ప్రతిమాద్యర్చనం సమూర్తార్చనం - అని అత్రి సంహిత వచించింది.

"అబ్రహ్మణి బ్రహ్మదృష్ట్యనుసంధానమ్"

ప్రతిమారాధనం అనగా బ్రహ్మం కాని దానిని బ్రహ్మంగా భావించి భక్తితో దానిపై మనసును లగ్నం చేయటం.

"సుస్థిర చిత్తంతో నీ పాదాలను ప్రోక్షించి గరిక పూజ చేసినా భక్తుడు ఉత్తమగతి పొందుతాడు" అని బ్రహ్మ వామనునితో పలికాడు. ఈ భక్తి ప్రపత్తితో మూర్తి పూజ చేస్తూనే ఆ స్వామిని నిర్వికారుడు విశ్వాత్ముడు విశ్వమయుడు అని భావన చేస్తారు భారతీయులు.

దేహో దేవాలయః ప్రోక్తో
జీవో దేవ స్సనాతనః
త్యజే దజ్ఞాన నిర్మాల్యం
సోఽహం భావేన పూజయేత్

దేహమే దేవాలయంగా, జీవుడే దేవుడుగా, అజ్ఞానమే నిర్మాల్యంగా, ఆ పరమేశ్వరుడే తానుగా భావన చేసి పూజచేస్తాడు భక్తుడు. ఇలా క్రమంగా సగుణారాధన అనే విగ్రహారాధన మానసికపూజకూ లేక నిర్గుణారాధనకూ దారి తీస్తుంది.

నిర్గుణారాధన లేక ఈ మానసిక పూజలో పుష్పాలు ఇలా సమర్పించాడు ఒక భక్తుడు :-

అహింసా ప్రథమం పుష్పం -
పుష్పమింద్రియ నిగ్రహం
సర్వభూత దయాపుష్పం -
క్షమాపుష్పం విశిష్యతే
శమః పుష్పం - తపః పుష్పం -
ధ్యానం పుష్పం తథైవచ
సత్యం చైవాష్టమం పుష్పం
ఏతై స్తుష్యతి కేశవః

అహింస - ఇంద్రియనిగ్రహం - భూతదయ - క్షమ - శమం - తపం - ధ్యానం - సత్యం అనే అష్ట గుణాలను పుష్పాలుగా అర్చన చేశాడు ఈ మానసిక భక్తుడు.

జీవాత్మ తనలోని సుగుణాలనే పుష్పాలుగా భావించి పరమాత్మను అర్చించటం మానస వికాసానికి ఆత్మోన్నతికి ఎంతగానో తోడ్పడుతుంది. మార్గం సుగమం చేస్తుంది.

ఒక భక్తుడు పరాత్పరునికి అంజలి ఘటించి మానసిక పూజ గావించిన విధం విశిష్టం -

కూర్చుండ మాయింట కుర్చీలు లేవు - నా
ప్రణయాంకమే సిద్ధ పరచ నుంటి
పాద్యమ్మునిడ మాకు పన్నీరు లేదు - నా
కన్నీళ్ళతో కాళ్ళు కడుగ నుంటి
పూజకై మావీట పుష్పాలు లేవు - నా
ప్రేమాంజలులె సమర్పింపనుంటి
నైవేద్య మిడమాకు నారికేళము లేదు
హృదయమే చేతి కందీయనుంటి
లోటు రానీయ నున్నంత లోన నీకు
రమ్ము దయసేయు మాత్మ పీఠమ్ముపైకి
అమృతఝరి చిందు నీ పదాంకములయందు
కోటి స్వర్గాలు మొలిపించుకొనుచు తండ్రి

అని ఆ జగదీశ్వరునికి తన ఒడినే ఆసనంగా కన్నీళ్ళే పాద్యంగా ప్రేమ అనే అంజలులే పూలుగా హృదయమే నారికేళంగా అర్పించ సంసిద్ధుడై ఆ స్వామిని ఆత్మపీఠంపైకి రమ్మనమని ఆహ్వానించాడు భక్తుడు.

ఏవిధంగా పూజించినా పరమాత్మ పరమ పదం ప్రసాదిస్తాడు.

శ్రీవిష్ణో రర్చనం యేతు ప్రకుర్వంతి నరాభువి
తేయాంతి శాశ్వతం విష్ణోరానందం పరమంపదమ్

## 17 సూ. కథా దిష్వితి గర్గః

భగవంతుని కథాదుల యందు ఆసక్తిచూపి ఆలకించటమే భక్తి అని గర్గ మహర్షి అభిప్రాయం.

భగవంతుని దివ్యలీలలూ మహిమలే కాక భక్తుల జీవిత గాథలు కూడ భగవత్కథలుగ పరిగణింపబడినాయి. ఈ కథలు శ్రవణం చేయటం - మననం చేయటం - కీర్తనం చేయటం - స్మరణం చేయటం - ఆసక్తితో ఆలాపించటం భక్తిలక్షణం అని గర్గమహర్షి ప్రవచించాడు. గర్గ ముని "సంహిత" రచించాడు. ఆ మహాజ్ఞాని కథాశ్రవణానికి మిక్కిలి ప్రాధాన్యం యిచ్చాడు.

శ్రీ మహావిష్ణు స్మరణం - కీర్తనం - శ్రవణం చేస్తున్నవారు కథలు వివరించేవారు ఆసక్తితో ఆలకించేవారూ అందరూ మహాభక్తులే.

భాగవతంలో నారదమహర్షి వ్యాసునితో అన్నాడు కదా - "విష్ణుదేవుని గుణకీర్తన శ్రవణమే తపస్సు. అదే అధ్యయనం. యజ్ఞమంత్ర జ్ఞానాదులవల్ల లభించే ఫలం ఇదే ప్రసాదిస్తుంది సుమా!" అని. మహాతత్త్వవేత్తలు తేల్చిన సారాంశం ఇది.

రామ కథా సుందర కరతారీ సంసయ
విహగ ఉడా వని హారీ
భవసాగర యహ పార జో పావా
రామకథా తా కహందృఢనావా

అని హరికథలో ఆసక్తి కలుగుటే భక్తి. ఈ భక్తితో పరమపదం లభిస్తుంది అంటాడు మహాకవి తులసీదాసు.

హరికథలు వినెడివారికి
మరణాగత మోహ సంభ్రమము లేదనఘా
భూషణములు చెవులకు బుధ
తోషణములనేక జన్మ దురి తౌఘవిని

## విశ్రాంతి ఎక్కడ?

గమ్యమెక్కడో? మజిలీ ఎన్నో?
మనసుకు శాంతి ఎన్నడో?
మనిషికి విశ్రాంతిఎక్కడో?
ఏడుస్తూ ఏడ్పిస్తూ వూడిపడ్డ జీవుడు
అడుగడుగునా ఓడిపోయి ఏడుస్తుంటే
ఓదార్చే నాథుడూ లేడు
ఓర్చుకొనే ఓపికా లేదు
అడవిలాంటి లోకంలో
ఎవడి గొడవ వాడిదే
చెవులున్నా వినపడవు
కళ్లున్నా కనపడవు
కాళ్లు మాత్రము గట్టివే
నడవడానికి దారి వుంది
బుద్ధుడేమో ఆశ వద్దని
సుద్దులెన్నో చెప్పినాడు
బుద్ధి మందగించిన మనిషి
గొంతు పట్టని ఆశలు పెంచుకొని
చింతలతో చీకాకులతో
పడుతూ, లేస్తూ, పడినందుకు తిట్టుకుంటూ
ముందు చూపుతో వెళుతున్నాడు పాపం!!

- మహబూబ్ కమల్

శోషణములు మంగళతర
ఘోషణములు గరుడగమన గుణ భాషణముల్

అని అనేకమంది మహాభక్తులు శ్రవణ భక్తికి మిక్కిలి ప్రాధాన్యం ఇచ్చారు. పరీక్షిన్మహారాజు శుక మహర్షితో కథాశ్రవణాసక్తిని ఇలా వచించాడు-

కల్యాణాత్మకమైన విష్ణుకథలా
కర్ణించుచున్ ముక్తసై
కల్యుండెవ్వడు తృప్తుడో –
అవి వినంగా క్రొత్తలౌచుండు-సా
కల్యంబేర్పడ భూసురోత్తమ !
ఎరుంగం పల్కవే! రుక్మిణీ
కళ్యాణంబు వినంగ నాకు మదిలో
కౌతూహలం బయ్యెడిన్

## 18 సూ. ఆత్మరత్యవిరోధేనేతి శాండిల్యః

ఆత్మరతికి అవిరోధమైన విషయాలపై అనురాగమే భక్తి అని శాండిల్య మహర్షి అభిమతం.

రతి అంటే అవిచ్ఛిన్నమైన భగవత్ ప్రీతి అని శ్రీధర వ్యాఖ్యానం. అవిచ్ఛిన్నంగా శుద్ధ ఆత్మ స్వరూపంలో రతుడై ఉండటమే ఆత్మరతి. ఆత్మరతిలో నిరతం నిత్యుడై ఉండటమే భక్తి అని అవ్యక్తోపాస కులు భావించారు.

నిర్గుణోపాసకులలో అగ్రగణ్యుడు శాండిల్యుడు. అందువల్ల ఆయన ఆత్మజ్ఞాన విధానంలో భక్తిని అన్వయించాడు. శంకర భగవత్పాదులు ఇలా అన్నారు –

మోక్ష కారణ సామగ్ర్యాం భక్తి రేవ గరీయసీ
స్వస్వరూపాను సంధానం భక్తి రిత్యభి ధీయతే

మోక్ష సామాగ్రిలో భక్తి ఉత్తమమైనది. భగవత్ భక్తి ఆ పరాత్పరుని యందు ఆసక్తి కలిగియుండుటే. ప్రతి ప్రాణి ఆత్మపీఠంపై ఆ ఆనంద స్వరూపుడు విరాజిల్లుతుంటాడు. ఆ పరాత్పరుని యందు ఆసక్తి కలిగి తన రూపాన్ని ఆ భగవంతునితో సంధానం చేసుకోవడమే భక్తి. కావున ఆ స్వామిపై భక్తిని ఇలా ప్రసరింపచేసుకోవటం సులభం.

ఉద్దాలక వశిష్ఠ శాండిల్యాదులు జ్ఞానులు. కనుక నే నిరాకార నిరంజన నిర్వికార నిర్గుణ పరబ్రహ్మోపాస నను గూర్చిన ఆత్మరతియే భక్తి అని ఉద్ఘాటించారు. శాండిల్య మహర్షి భక్తిసూత్రాలు పెక్కింటిని రచించాడు.

పరబ్రహ్మ యందు నిరతిశయ అనురాగమే భక్తి. పరమాత్మయందు ప్రేమరూపమైన భక్తి లభ్యమైనచో సర్వసాధనాలు సమకూరుతాయి. వేదాంతంలో భక్తునికి బ్రహ్మయొక్క పరోక్షానుభవం ప్రేమలక్షణం. అది భక్తియొక్క పరిణామ ఫలస్వరూపమే. ఈ ప్రేమ వలన ద్వైతం మరుగునపడి సర్వ సమన్వయం చేయగల అద్వైతబుద్ధి అలవడుతుంది.

వాసుదేవుడే పరమబ్రహ్మమనీ, పరమాత్ముడనీ, అణువనీ, బ్రహ్మండమనీ, నిర్గుణడనీ, సగుణడనీ, భావించాడు. సూర్యుడూ, ఆకాశం, భూమీ, చంద్రుడూ, ఆదిగాగల అష్టతనువులు విశ్వనాధునివి అనీ, విశ్వ నాధుడే విష్ణువు అనీ విశ్వమూర్తి అనీ ఉదాత్త భావన కలుగుతుంది. సగుణారాధన క్రమక్రమంగా నిర్గుణా రాధనకు దారితీస్తుంది. ఆత్మరతి కలుగజేస్తుంది. పరమాత్మను అందిస్తుంది.

సగుణమనంగనీవు విను –
శంఖ సుదర్శన ముఖ్య చిహ్నితం
బగు పురుషోత్తమాకృతి –
తదన్యము నిర్మల నిత్య చిన్మయం
బగు పరమాత్మరూప –
మది యబ్బుట దుర్లభ మెట్టివారికిన్
సగుణవిలాస చింతనము సల్పగ
సల్పగ గాని – భూసురా !

# గీత_అమృతవర్షిణి

సాయి గంగామహాదేవ్

శ్లో॥ స ఏవాయం మయా తేఽద్య
యోగః ప్రోక్తః పురాతనః।
భక్తోఽసి మే సఖా చేతి
రహస్యం హ్యేతదుత్తమమ్॥

—అనంతాత్మ జ్ఞానసార సమన్విత స్వరూపమే శ్రీ మద్భగవద్గీత. ఇది భగవంతుడందించిన అమృత నిధి. అందించేవాడున్ననూ, అందుకొనువారలున్ననూ, సరిపోదు. అర్హత అనునది అతిముఖ్యమైనటువంటిది. అర్హత లేకుండా ప్రకృతిలోగానీ, సుకృతిలోగానీ ఏదియునూ అందుకొనుటకు వీలులేదు. అల్పమైన ఒక డిగ్రీని తీసుకోవాలంటే 15 సంవత్సరములు విద్యార్థి కృషి చేయాలి. కృషి చేయడమేకాక ఆ కృషిలో తాను ఉత్తీర్ణుడైతేనే ఆ డిగ్రీ లభిస్తున్నది. ఆ 15 సంవత్సరముల కృషి + ఉత్తీర్ణత ఆ డిగ్రీ తీసికొనుటకు అర్హతను కలిగిస్తున్నది. అల్పమైన ప్రకృతిలోనే అర్హత గమనింపబడుతుంటే, అద్వితీయమైన ఆధ్యాత్మికతలో ఇంకెంతగా అర్హతలను గమనించవలసి వుంటుందో గమనించాలి. ఇచ్చట భగవానుడదే చెబుతున్నాడు.

"పురాతనము, పరమ రహస్యము, ఉత్తమము ఐన యీ ఆత్మజ్ఞానము నీవు నాకు భక్తుడవు, సఖుడవు గనుక చెప్పినాను" అని భగవద్వచనము. ఇచ్చట అర్హతేమిటి ? భక్తి, సఖ్యము కలిగివుండుటే అర్హత. ఐతే దీనినింకనూ ఆలోచించాలి. భగవానుడు అర్జునుని భక్తుడవు అంటే సరిపోతుంది, లేదా సఖుడవు అంటే సరిపోతుంది. కానీ అట్లుగాక భక్తుడవు, సఖుడవు అని ఎందుకన్నారు? భక్తునికి, సఖునికి వున్న తేడా ఏమిటి?

ప్రీతి + భీతి, కలిగినవాడు భక్తుడు. ప్రీతి — భీతి కలిగినవాడు సఖుడు. కేవలం భక్తుడుగా వుంటే దైవముమీద ప్రేమ వున్నా, అతడు దైవం, నేను దాసుడు; అతడు భగవంతుడు, నేను భక్తుడు అనే భయం, భిన్నభావం తప్పక వుంటాయి. దీనివలన దైవతత్వాన్ని స్వతంత్రంగా, ధైర్యంగా తెలుసుకొని ఆనందించడానికి వీలులేదు. ఇక సఖుడు. వీనికి భయమేమీ వుండదు. కేవలం ప్రీతే వుంటుంది. కేవలం చనువు, స్వతంత్రం, ప్రీతి వుండడంవలన భగవంతుని తలమీద కెక్కుతాడు. నిత్య సన్నిహితమువలన దానిని అనుభవిస్తున్నప్పటికినీ దాని విలువను గ్రహించలేడు. విలువను గ్రహించలేనినాడు అది తన చెంత వున్నా, అనుభవమునందున్నా లాభంలేదు. వంద రూపాయల విలువ తెలియని పిచ్చివాని చేతిలో వందలున్నా లాభమేమిటి? దానివలన పొందవలసిన లాభం పొందలేడు. అర్జునుడు కేవలం సఖుడుగా వున్నందుననే కురుసంగ్రామ కాలం వరకూ కృష్ణుని నుండి ఆత్మజ్ఞానంను పొందలేక పోయాడు. కనుక భక్తలక్షణములు + సఖ్యలక్షణములు చేరి అర్హతాలక్షణములుగా రూపొందుతాయి. కురు సంగ్రామకాలసమయంలో అర్జునునిలో ఈ రెండు లక్షణములు మూర్తీభవించినవి. అందువల్లనే ఆత్మజ్ఞానం లభించింది. సారాంశం ఏమనగా భగవంతునియందు ప్రేమ + భయం + చనువు మూడూ వుండాలి.

ఈ మూడింటివలన మూడు ఫలితాలు లభిస్తాయి. చనువు వలన భగవంతుని మాధుర్యాన్ని అనుభవిస్తూ ప్రకృతిపరమైన అనుభవ సంబంధవాసనలను తగ్గించుకొంటాడు. భగవద్భయం వలన అధర్మకర్మలు, దుశ్చింతలు, దురభ్యాసములు, పాపకర్మలు, దుష్టవాక్కులు మానుకొంటాడు. తత్ఫలితంగా ఇంద్రియ నిగ్రహం లభిస్తుంది. ఇక ఎడతెగని ఆ మధురమైన భగవత్ప్రేమ వలన ఆ దైవమే తానైపోతాడు. తానే ప్రేమైపోతాడు. వ్యక్తిత్వం అదృశ్యమై ముక్తిత్వం శేషిస్తుంది. అదే ప్రేమలోవున్న దివ్యత్వం. ఐతే మొదటి రెండు అర్హతలు లభించనిదే ఈ ప్రేమ వుండినను ఫలించదు. చెట్టుకు నీరు పోయాలి, ఎరువు వేయాలి. అప్పుడే కాయ పండుగా మారుతుంది. వాసనా రాహిత్యమే నీరు, ఇంద్రియనిగ్రహమే ఎరువు. ప్రేమనే ఫలము. కనుక వీనిని పొంది భగవత్కృపను అంది, దైవమునుచెంది ఆనందమందెదరుగాక! స్వస్తి!

# కొమరగిరి





( గత సంచిక తరువాయి )

సెంట్రల్ జైలు, రాజమండ్రి
ది 12–4–1976

ప్రియమైన జయ,

శ్రీరామనవమి విజయవంతంగా జరిగింది. 'సుందర కాండ' పారాయణం పూర్తిఅయిన సందర్భమున శాంతి సంతర్పణ చేశాం. రాత్రి పూట ఆర్కెస్ట్రాతో భజనలు కూడా చేశాం. ప్రస్తుతం దేశం ఎదుర్కొంటున్న విపత్కర పరిస్థితులను అధిగమించడానికి 'శ్రీరామచరితం' ఎంతో ఉపయోగపడుతుందని నా విశ్వాసం. అందువలన రామాయణ మహాకావ్యంలోని కొంతమంది ప్రముఖుల వ్యక్తిత్వాలను గురించి క్లుప్తంగా వివరించదలిచాను.

"రామాయణ మహాకావ్యము యావత్ భారత జాతి యొక్క సర్వస్వమై వెలయుచున్నది. శతాబ్దముల తరబడిగ జాతియొక్క విచారధారను, కావ్యప్రపంచమును ఇంతగా ప్రభావిత మొనర్చిన మఱియొక కావ్యము ప్రపంచమునసే సాహిత్యమునను కానరాదు" అని జర్మన్ పండితుడు 'వింటర్‌నిట్జ్' వ్రాశాడు.

ఈ మహాకావ్య విశిష్టతను, శ్రీరాముని ప్రతిభను గ్రహించిన కీ॥ శే॥ మహాత్మాగాంధి 'రామరాజ్యాన్ని నెలకొలపటమే నా పరమావధి' అని చెప్పారు. కాని కొంతమంది అభ్యుదయవాదులమని భావించే నాయకులకు ఇది ఏ మాత్రం నచ్చలేదు. ఈ పిచ్చికొల్లాయి కట్టిన ముసలిగాంధి సనాతనమైన రామరాజ్యాన్ని అభిలషిస్తున్నాడని విమర్శించారు. కాని గాంధీజీ తన ఆశయాన్ని విడనాడక రామరాజ్యాన్ని గురించే ప్రచారం చేయసాగాడు. కారణం శ్రీరాముని వ్యక్తిత్వం అటువంటిది.

ఆయన ఆదర్శప్రాయుడు, పురుషోత్తముడు, మాతా పితృభక్తుడు, ఏకపత్నీ వ్రతుడు, సర్వలక్షణ సంపన్నుడు, సత్యసంధుడు, జితేంద్రియుడు, ధర్మరక్షణ పరాయణుడు, శరణాగత రక్షకుడు, మహా బల సంపన్నుడు, రాజనీతి కోవిదుడు, వేదవేదాంగ తత్వజ్ఞుడు, ప్రజానురంజకుడు, విశుద్ధమైన ప్రజాస్వామ్యవాది. అందువలననే 'రామరాజ్యాన్ని' పునఃప్రతిష్ఠించాలని మహాత్మాజీ తహతహలాడేవారు.

శ్రీరాముడు ప్రజాభిప్రాయానికి మిక్కిలి ప్రాముఖ్యత నిచ్చేవాడు. సామాన్య ప్రజల మనోభావాలను ఎప్పటికప్పుడు తన గూఢచారి విభాగం ద్వారా తెలుసుకుంటూ, తదనుగుణంగా, ఆదర్శవంతమైన, ధర్మ పరిపాలన కొనసాగించాడు. ప్రజాభిప్రాయాన్ని మన్నించిన మానవోత్తముడు. " లోకారాధన కోసం స్వజనులపట్ల స్నేహాన్ని మానుకోవలసివచ్చినా, దయను మమకారాన్ని విడచి నిష్ఠూరంగా వ్యవహరించవలసి వచ్చినా, సుఖ రాజ భోగాలను త్యజించవలసి వచ్చినా, అన్నింటినీ మించి "సీత" ను పరిత్యజించవలసి వచ్చినా నేను బాధపడను" అని శ్రీరాముడు అంటాడు. తన జీవిత సమరంలో తాను ఆ ఆదర్శాలను ఆచరించి, ఆదర్శమైన పరిపాలన కొనసాగించాడు. మారుమూల గ్రామంలోని పూరిగుడిశనుంచి అర్థరాత్రి వినపడిన మాటలను తన వేగులవారి ద్వారా విని, నిండుచూలాలు అయిన తన ప్రియురాలైన, తన సహధర్మచారిణి అయిన సీతను నిర్దాక్షిణ్యంగా అరణ్యానికి పంపించివేశాడు. ప్రజాభిప్రాయాన్ని శ్రీరాముడు ఏవిధంగా మన్నించేవాడో ఈ ఉదంతంవల్ల అర్థం చేసుకోవచ్చు. ఈనాటి స్వార్థపూరిత వాతావరణంతో

పోల్చుకుంటే రామరాజ్య వైశిష్ట్యమును బాగా అర్థం చేసుకోవచ్చు.

తండ్రి యాజ్ఞానుసారం 14 సంవత్సరాలు వనవాసం చేసిన పితృభక్తి పరాయణుడు. ధర్మాచరణం అతని ప్రాణం. అరణ్యవాసానికి బయలుదేరేటప్పుడు తల్లి అయిన కౌసల్య విలపిస్తుంది, తనతోపాటు అరణ్యానికి వస్తానంటుంది, చివరికి చచ్చిపోతానని బెదరిస్తుంది. అప్పుడు శ్రీరాముడు తల్లిని ఓదారుస్తూ "తండ్రి వాగ్దానమును నిలబెట్టటం పుత్రుని కర్తవ్యం. కనుక నేను అడవులకు వెళ్ళుతున్నాను. పతివ్రతయగు స్త్రీకి భర్త సేవ చేయడం కంటే వేరొక ధర్మము లేదు. కనుక అయోధ్యలో వుండి నా తండ్రి దశరథునికి సేవ చేయడం నీ ధర్మం" అని అంటాడు. తరువాత జటాజినధారయై, సీతాలక్ష్మణులతో సహా శెలవు తీసికొనడానికి తండ్రి వద్దకు వెళ్ళుతాడు. వారిని చూచి శోకావేశపరుడై దశరథుడు మూర్ఛిల్లుతాడు. రామలక్ష్మణులు కొంచంసేపు సపర్యలు జరుపగా తెలివి వస్తుంది. అడవులకు వెళ్ళవద్దని పట్టాభిషిక్తుడవై రాజ్యాన్ని పాలించమని కోరుతాడు. శ్రీరాముడు అంగీకరించడు. "నాకు రాజ్యముపైనగాని, రాజ్యసుఖములపైనగాని ఎట్టి వ్యామోహం లేదు. [illegible]గ్దానం నిలబెట్టుటే నా పరమావధి. పుత్రవ్యామోహ పరవశుడవై దుఃఖింపకుము. నేను కోరునది ఒకటియే. నీవు సత్యమును పాలించుట, వాగ్దానభంగం చేయకుండుట" అని చెప్పి సత్యసంధుడైన శ్రీరామచంద్రుడు తండ్రి వాగ్దానమును నిలబెట్టుటకై అడవులకు పయనమైపోతాడు, శోకావేశపరుడై పుత్రశోకంతో దశరథుడు మరణిస్తాడు. భరతుడు సపరివారంతో దండకారణ్యానికి వెళ్ళి రాజ్యాన్ని స్వీకరించమని ప్రార్థిస్తాడు. జాబాలి, వశిష్ఠులు కూడా కోరుతారు. 14 సం॥రాల వనవాసాన్ని తానే చేస్తానని భరతుడంటాడు. ప్రయోజనం లేకపోవటం వలన చిట్టచివరికి భరతుడు ప్రాయోపవేశమునకు పూనుకుంటాడు. అప్పుడు శ్రీరాముడు భరతుని



# ప్రశ్నలు - సమాధానాలు

రాష్ట్రాలలో రాష్ట్రపతి పాలన కొనసాగుటకు గరిష్ఠ పరిమితి ఎంత?

రక్తం గడ్డకట్టుటలో తోడ్పడే విటమిన్ ఏది?

ఇండియాలో మొదటి బట్టలమిల్లు ఎక్కడ స్థాపింపబడినది?

ఇండియాలో తూర్పు పడమరల మధ్య అతి దూరమందున్న రెండు ప్రదేశాలలోని స్థానిక టైముల మధ్యనున్న తేడా ఎంత?

'గే' అని పిలువబడే నగరమేది?

మన దేశంలో టెలిఫోన్లు ఎక్కడ తయారవుతున్నవి?

"అమ్నీసియా" అంటే ఏమిటి?

కుంకుమపువ్వు పొలాలకు ప్రసిద్ధిగాంచిన రాష్ట్రమేది?

"మక్కా ఆఫ్ వరల్డ్ క్రికెట్" గా పేర్గాంచిన ప్రదేశం ఎది?

"షేరు-ఇ-పంజాబ్" ఎవరు?

నీటిలోతును దేని ద్వారా కొలుస్తారు?

1) 3 సంవత్సరములు 2) విటమిన్K 3) కలకత్తాలో 4) రెండు గంటలు 5) పారిస్ 6) బెంగుళూర్‌లో 7) జ్ఞాపకశక్తిని కోల్పోవుట 8) కాశ్మీర్ 9) లార్డ్స్ క్రికెట్ గ్రౌండ్ 10) లాలా లజపతి రాయ్ 11) ఫాతోమీటర్

ఓదారుస్తూ "నేను తండ్రి ఆజ్ఞను శిరసావహించి అడవులకు వచ్చాను. ఇది నా ధర్మం. నీవు కూడా తండ్రి యాజ్ఞానుసారము రాజ్యపరిపాలన చేయుట నీ ధర్మము" అని చెప్పి పంపించివేస్తాడు భరతుణ్ణి. దీనివల్ల శ్రీరాముని ఉదారత, ధర్మ నిష్ఠా పరాయణత్వం, నిస్వార్థబుద్ధి అవగతమవుతున్నది. ఏదో విధంగా అధికారం పొందాలనే తాపత్రయం ఆయనలో ఏ మాత్రం గోచరించదు. రాజ్యాధికారాన్ని కన్నా, ధర్మానికే ఎక్కువ విలువ యిచ్చి భావితరాలవారికి ఆదర్శప్రాయుడైనాడు. అందువల్లనే మహాత్మాగాంధీజీ దూరదృష్టితో రానున్న విష పరిణామాలను ముందుగానే ఊహించి శ్రీరామచంద్రుని ఆదర్శంగా గైకొనమని తన అనుచరులకు, ప్రజలకు బోధించాడు.

శ్రీరాముని భాతృప్రేమ వర్ణనాతీతము. సోదరులంటే అతనికి అమితమైన ప్రేమ. ఒకమారు లక్ష్మణునితో "భరతుడుగాని, శత్రుఘ్నుడుగాని, నీవుగాని లేకుండా ఎట్టి అల్పమగు సుఖమును కోరను. ఒకవేళ అటువంటి కోరిక ఉదయిస్తే దానిని అగ్నిహోత్రుడు భస్మము చేయుగాక! ఈ భూమి నా కొఱకు గాక, మీ కొఱకు కావలెనని కోరుచున్నాను. మిమ్ము సంతోషపెట్టుటకును, సుఖమును కలుగజేయుటకును నాకు రాజ్యమపేక్షితము" అని శ్రీరాముడు అంటాడు. అంతేగాక యుద్ధంలో లక్ష్మణుడు మూర్ఛిల్లినప్పుడు విలపిస్తూ "నాకు రాజ్యముతో నేమి పని? అతను లేకుండగ బ్రతికి మాత్రమేమి చేయుదును? ఇక యుద్ధము మాత్రమేల చేయవలెను? నేను వనమునకు బయలుదేరినపుడు, ఎట్లు ఈ మహాద్యుతియగు లక్ష్మణుడు బయలుదేరనో? యట్లే యమసదనము కరుగు లక్ష్మణుని వెంట నేనూ బయలుదేరుదును. ఏ దేశమునకు వెళ్ళినను భార్యలు దొరుకుదురు. బంధుత్వ మేర్పర్చుకొనవచ్చును. కాని సహోదరుడగు "భ్రాత" లభించు దేశమేదియూ కానరాదు" అని శ్రీరాముడు విలపిస్తాడు. ఆదర్శవంతమైన సోదరప్రేమ ఏ విధంగా వుంటుందో ఆచరించి, అనుసరించి మనకు చూపించాడు శ్రీరాముడు.

తనను అరణ్యవాసానికి పంపడానికి కారణభూతురాలైన కైకను చూచి "అమ్మా! అడవిలో వుండి శరీర పోషణం చేసుకొనే భారం మాత్రం నామీద పెట్టావు. పాపం! కుర్రవాడు భరతుని మీద సమస్త భువనపోషణ భారమూ మోపావు. మా ఇద్దరిలో ఎవరికి ఎక్కువ సౌకర్యము కల్గించావని విచారిస్తే, నీకు నా యెడలనే పక్షపాతం ఉన్నట్లు కనిపిస్తున్నది" అని శ్రీరాముడు అంటాడు. విషాన్ని కూడా మధురంగా స్వీకరించగల విశాల ఉదార సంపన్నుడు శ్రీరాముడు. తనను ద్వేషించినవారిని కూడా మృదుమధురంగా పలుకరించగల సహనశీల. అంతేకాదు సహజ సహన స్వభావ శక్తియుక్తులు కలవాడు శ్రీరాముడు.

యుద్ధంలో నిరాయుధుడైన రావణుని చంపకుండా "రాక్షస రాజా! లంకా పట్టణములోనికి వెళ్ళి కొంచం విశ్రాంతి తీసుకో! రథారూఢుడవై ధనస్సుతో సహా

తిరిగి మళ్ళీ రా ! అప్పుడు నాతో పోరాడు" అని ఎంతో హుందాతనంగా, ఔదార్యంతో - నిస్సహాయుడై యున్న రావణునితో యుద్ధభూమిలో అంటాడు. ప్రియమైన తన అర్ధాంగియైన సీతను అపహరించిన దుష్టుడైనప్పటికీ, అవకాశం దొరికిందిగదాయని అధర్మంగా చంపలేదు. యుద్ధనీతిని తూచా తప్పకుండా అనుసరించిన ధర్మశ్రేష్టుడు, సర్వశక్తి సంపన్నుడు, యుద్ధ నీతి కోవిదుడు శ్రీరామచంద్రుడు.

శత్రువులకు కూడా శ్రీరాముని యెడల అత్యున్నతమైన గౌరవ భావం వుండేదని ఈ సంఘటనవల్ల అర్థమవుతున్నది. రావణుని కుమారుడైన మేఘనాథుని యుద్ధంలో లక్ష్మణుడు చంపుతాడు. భార్య సులోచన సహగమనం చేయ సంకల్పించుకుంటుంది. భర్త శవం యుద్ధభూమిలో ఉన్నది. అప్పుడు రావణుడు కోడలిని శ్రీరాముని శిబిరానికి వెళ్ళి అడిగి భర్త శవాన్ని తెచ్చుకోమంటాడు. శత్రు శిబిరానికి ఒంటరిగా వెళ్ళడానికి సంశయిస్తుంది సులోచన. అప్పుడు రావణుడు "బాలబ్రహ్మచారి హనుమంతుడు, జితేంద్రియుడు లక్ష్మణుడు. ఏకపత్నీవ్రతుడు రాముడున్న చోటికి నిర్భయంగా వెళ్ళవచ్చును. అమ్మా !" అని అంటాడు. అప్పుడు "మీరు రాముని భార్యను తెచ్చారే! అలాంటి రాముని దగ్గరికి మీ కోడలిని పంపటం ఉచితమా!" అని సందేహాన్ని వెలిబుచ్చుతారు మంత్రులు. అప్పుడు "పరస్త్రీని అపహరించడం ఈ రావణుని పనికాని రాముని పనికాదు" అని రావణుడు అంటాడు. శత్రువులకు కూడా శ్రీరాముని యెడల ఎటువంటి సద్భావం వుండేదో దీనివల్ల మనం అర్థం చేసుకొనవచ్చు.

సీత అడవులలో వున్నప్పుడు అశ్వమేధయాగం చేయ సంకల్పించుకుంటాడు. సతీసమేతుడైనవాడే ఈ యాగాన్ని చేయటానికి అర్హుడు. అటువంటి సమయంలో కూడా ద్వితీయ పత్నిని పరిగ్రహించడానికి



అంగీకరించక సువర్ణ సీతామూర్తిని ప్రక్కన పెట్టుకొని యాగం పూర్తి చేస్తాడు. ఆ రోజులలో బహు భార్యత్వం తప్పు కాదు. తండ్రియైన దశరథుడికి 350 మంది పైన భార్యలుండేవారుట. అటువంటి సమాజ పరిస్థితులలో కూడా శ్రీరాముడు "ఏకపత్నీ వ్రతాన్ని" విడనాడలేదు. ఈ సంఘటన శ్రీరాముని సౌశీల్యాన్ని యినుమడింపజేసింది.

సచ్ఛీల గుణసంపత్తి గలవాడు కావటంవల్లనే శ్రీరాముని మహాత్మా గాంధీజి ఆదర్శంగా గైకొనినాడు. ఆ మహనీయుని ఈనాటి పాలకులు అనుసరిస్తే సంక్షోభమనేదానికే తావుండదు. అందుకోసమనే వేల సంవత్సరాలైనప్పటికి శ్రీరాముని ప్రజలు మరువలేదు, మరువరు. భారతదేశంలోని అన్ని తరగతుల ప్రజలలో ఆ మహనీయునికి స్థానం ఎల్లప్పుడూ ఉంటుంది.

మిగలా వివరాలు వచ్చే ఉత్తరంలో వ్రాస్తాను.

ఇట్లు
'నీ'

# కథారచనలో అద్వితీయుడు మల్లాది రామకృష్ణశాస్త్రి

ఈ శతాబ్దపు తెలుగు కథారచయితల గురించి ప్రస్తావించుకున్నప్పుడు తప్పనిసరిగా పేర్కొనవలసిన ఇద్దరిలో ఒకరు శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు కాగా, మరొకరు మల్లాది రామకృష్ణశాస్త్రిగారు. వీరిలో మొదటివారు గోదావరి మండలానికీ, రెండవవారు కృష్ణా మండలానికి చెందినవారు. ఇంగ్లీషు భాషా సాహిత్యాల ప్రభావానికి లోనుకాకుండా, స్వచ్ఛమైన తెలుగు పలుకుబడిని ఒకారాలతో వీరు రచనలు సాగించారు. గోదావరి ప్రాంత తెలుగు తియ్యదనం సుబ్రహ్మణ్య శాస్త్రిగారి రచనలలో తొణికిసలాడుతూ వుంటే తెలుగు పదాల గాంభీర్యం సౌందర్యం రామకృష్ణశాస్త్రిగారి రచనలలో "కదను" తొక్కుతుండేది. ఇద్దరిదీ విలక్షణ మైన వ్యక్తిత్వం. వీరిలో సుబ్రహ్మణ్యశాస్త్రిగారి గురించి మరోసారి ప్రస్తావించుకుందాం.

కంచి వాసుదేవరావు

శైలిలోనూ, ఇతివృత్తంలోనూ, కథనంలోనూ మల్లాది రామకృష్ణశాస్త్రిగారు విలక్షణమైన ప్రత్యేకత సంపాదించుకున్నారు. ఒకసారి చదివిన ఆయన శైలి కొరకుడు పడదు. గుర్రాన్ని పరుగెత్తిస్తున్నట్లుగా కాక కదను తొక్కించి "పీట్సు" చేయిస్తూ వుంటుంది ఆయన శైలి. ఆయన శైలిని అర్థం చేసుకుని హర్షించాలంటే కొంత ఓపిక అవసరం. ఐతే ఆయన ఎన్నుకున్న ఇతివృత్తాలు విలక్షణమైనవి. అంతర్గర్భితమైన సభ్యమైన శృంగారం దృశ్యాదృశ్యంగా, పన్నీటిజల్లుగా మలయమారుతంలా సాగుతుంది. ఆయన రచనలలో సెక్సు వర్ణనలు కాని అంగాంగ వర్ణనలు కాని వుండవు. ఐనా మనసును అలరింపచేసే శృంగారం వుంటుంది. శృంగారం, సరసత్వం పేరిట బూతుకథలు విరివిగా వస్తున్న ఈ రోజులలో సభ్య శృంగారాన్ని కోరేవారు రామకృష్ణశాస్త్రిగారి రచనలు చదవాలి. ఆయన కథలలో స్త్రీ, పురుష పాత్రలన్నీ విలక్షణమైనవీ,విస్మరింపరానివి. వారు తన కథలకు పెట్టుకున్న పేర్లు - డుముపులు, అల్లూనేరేడు, అసావీలి కూడా విలక్షణంగా వుంటాయి. విలక్షణమైన శైలి, శిల్పం కథనంవల్లనే రామకృష్ణ శాస్త్రిగారు తెలుగుకథా ప్రపంచంలో శాశ్వత స్థానం సంపాదించుకున్నారు.

రామకృష్ణశాస్త్రిగారు కథకుడే కాదు మహాకవి. సంస్కృత సాహిత్యంలో ఆయనకు గల పాండిత్యం తెలుగులో ఆయన మహాకవి కావడానికి తోడ్పడింది. సినిమా పాటలకు సాహిత్య గౌరవం కల్పించిన ఇద్దరు ముగ్గురు కవులలో ఆయన ఒకరు. ఆయన డబ్బుకోసం సినిమా పాటలు రాయలేదు. నిర్మాతలు రాయమన్నట్లు రాయలేదు. తననీ, తన సాహిత్యాన్నీ గౌరవించగల నిర్మాతలకు, దర్శకులకు ఆయన పాటలు వ్రాశారు. తన స్థాయిని తగ్గించుకోకుండా రచనలు చేశారు. చివరకు మిగిలేది, చిరంజీవులు, జయభేరి, రహస్యం, వీరాంజనేయ మొదలైన చిత్రాలలో పాటలు అప్పటికీ, ఇప్పటికీ, ఎప్పటికీ రసగుళికలుగా వుంటాయి. ముఖ్యంగా రహస్యం చిత్రంలో ఆయన రచించిన "గిరిజా కళ్యాణం" యక్షగానం, దానికి ఘంటసాల వెంకటేశ్వరరావుగారు సమకూర్చిన సంగీతం ఎన్నటికీ మరపురానివి. రహస్యం చిత్రం ఆర్థికంగా బాగా దెబ్బ తిన్నప్పటికీ ఆ పాటల ద్వారా తన జన్మసాఫల్యత పొందినట్లు రామకృష్ణశాస్త్రిగారు భావించేవారు.

ఆయన తన పేరుతోనే కాక తన కొందరు మిత్రుల పేరిట కథలు రాసి వారిపై "కథకులు" అనే ముద్ర

చేయించారు. వీరిలో చెప్పుకోదగ్గవారు వి.ఎన్ భూషణ్ గారు, ఆయన ఇంగ్లీషు పండితుడు, మచిలీపట్నంలో తనకు సన్నిహిత మిత్రుడు, ఆయన పేరుతో కొన్ని కథలు రాశారు. తల్లావఝుల శివశంకరశాస్త్రిగారు, రామకృష్ణశాస్త్రిగారికి సన్నిహిత మిత్రులు. అప్పటికీ కవిగా, విమర్శకునిగా పేరు తెచ్చుకున్న శివశంకర శాస్త్రిగారు "కథలు నా పేరున చూడాలని వుందోయ్" అని రామకృష్ణశాస్త్రిగారితో అన్నారుట. "ఎందుకండీ మీకా శ్రమ" అంటే శివశంకరులవారు వినిపించుకో లేదట. చివరకు రామకృష్ణశాస్త్రిగారు నవ్వుతూ "ఎందరికో తద్దినం పెట్టాను, ఇది మరొకటి" అన్నారుట ఆ విధంగా శివశంకరశాస్త్రిగారి పేరిట మల్లాది రామ కృష్ణశాస్త్రిగారు వ్రాసిన "నీలకంఠం కథలు" వెలుగు లోకి వచ్చాయట. ఈ కథలలో ఆలారికాచౌర్య చాలా ప్రసిద్ధికెక్కింది. సుప్రసిద్ధ సినిమా రచయిత సీనియర్ సముద్రాల మరియు రామకృష్ణశాస్త్రిగారు సన్నిహిత మిత్రులు. సముద్రాల పేరిట చలామణిలోవున్న కొన్ని పాటలను రచించింది రామకృష్ణశాస్త్రిగారని ఇద్దరికీ సన్నిహితులైన కొందరికి మాత్రమే తెలుసు.

సరస్వతీ పుత్రుడయిన కవికి తగిన గౌరవం ఇవ్వాలని అతన్ని చిన్న చూపు చూడరాదని ఆయన భావించేవారు. అంతేకాదు తన గౌరవాన్ని ప్రతిష్టను నిలబెట్టుకోవాలని ఆయన వాదించేవారు. ఇందుకు రెండు ఉదంతాలను పేర్కొనవచ్చు.

కోయంబత్తూరులో ప్రముఖ చిత్రనిర్మాణ సంస్థ పక్షిరాజా ఫిలిమ్సు అధినేత శ్రీరాములునాయుడు, తమ యూనిట్ లో రచయితగా రామకృష్ణశాస్త్రిగారికి ఆ రోజు లలో చాలా ఎక్కువ జీతంతో నియమించే ఉద్దేశంతో ఆయన శాస్త్రిగారిని కోయంబత్తూరుకు ఆహ్వానించారు. దాన్ని పురస్కరించుకుని శాస్త్రిగారు సముద్రాలను వెంట బెట్టుకుని కోయంబత్తూరుకు వెళ్లారు. శ్రీరాములుగారు ఇద్దరికీ మంచి బస ఏర్పాటు చేశారు. ఐతే ఆయన రామకృష్ణశాస్త్రిగారితో సోఫాలో కూర్చునే కరచాలనం చేశారు. అది ఇన్సల్టుగా భావించి శ్రీరాములునాయుడు గారి ఆహ్వానాన్ని తిరస్కరించి మద్రాస్ తిరిగి వచ్చే శారు. ఎదుట వ్యక్తిని గౌరవించదలచినవారు, కూర్చున్నచోట నుంచి లేచి వచ్చినవారితో కరచాలనం చేసి నమస్కారంతో ఆప్యాయంగా కూర్చోపెట్టటం మర్యాద. అట్టి మర్యాదను పాటించనందుకు రామకృష్ణ శాస్త్రిగారు అంతటి మంచి ఉద్యోగాన్ని గడ్డిపోచను తృణీకరించినట్లు తృణీకరించారు.

జలరుహ అనే సంస్థ మద్రాస్‌లో ఒక ఆఫీస్‌ను ఏర్పాటు చేసుకుని "రాజనందిని" అనే చిత్రాన్ని నిర్మిస్తున్న రోజులవి. ఆ చిత్రానికి రచయిత రామ కృష్ణశాస్త్రిగారు. జలరుహవారి ఆఫీస్, రామకృష్ణశాస్త్రి గారి నివాసం కొన్ని అడుగుల దూరంలో దాదాపు ఎదురుబొదురుగా వుండేవి. ఐతే తనకు కారు పంపిస్తే కాని రామకృష్ణశాస్త్రిగారు జలరుహ కార్యాలయానికి వెళ్ళేవారు కాదు. కొన్ని అడుగుల దూరం నడవలేక కాదు. కవికి లభించవలసిన గౌరవంలో ఒక భాగంగా కారు కోసం ఆయన పట్టుదల వహించేవారు. రోడ్డుకు మధ్యగా కారు నిలిపేవారని రామకృష్ణశాస్త్రిగారు ఒక డోరు నుంచి కారులో ఎక్కి మరో డోరు నుంచి దిగి జలరుహవారి ఆఫీస్‌కు వెళ్లేవారని ఏదో సినిమా పత్రికలో చదివాను.

ఈ రెండు ఉదంతాలు విచిత్రంగా కన్పించవచ్చు. కాని రచయితకు, కవికి తగిన గౌరవం లభించాలని ఆయన ఎంత దృఢంగా భావించేవారో ఈ రెండు [illegible] వెల్లడిస్తాయి.

రామకృష్ణశాస్త్రిగారి జీవితంలో తొలి భాగం బందరులో గడచింది. ఆయన మహాపండితుడు, విద్యా పోషకుడు అయినపురాణం సూరిశాస్త్రిగారి అల్లుడు. ఆ రోజుల్లో పేరడీకవి జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రిగారు, అడవి బాపిరాజుగారు, కాటూరి వెంకటేశ్వరరావుగారి వంటి హేమాహేమీలు బందరులో వుండేవారు. రుక్మిణీ నాథశాస్త్రిగారు, రామకృష్ణశాస్త్రిగారు, వీరికి భూషణ్‌గారు కలిస్తే "మహానందడి"గా వుండేదని చెప్పుకునేవారు.

రామకృష్ణశాస్త్రిగారు మచిలీపట్నంలో వున్నా మద్రాస్‌లో వున్నా ఆయన చుట్టూ అనేకమంది పరివేష్టించి వుండేవారు. సరసోక్తులు, చమత్కార సంభాషణలు, సాహిత్య చర్చలు జరుగుతూ వుండేవి. ఆరుద్ర వంటి వారెందరో రామకృష్ణశాస్త్రిగారిని గురు తుల్యులుగా భావించి గౌరవించేవారు.

ఒక పుస్తకాన్ని లేక సినిమాను సమీక్షించవలసి వచ్చినప్పుడు, లేదా దాని విలువను అంచనా వేయవలసి వచ్చినప్పుడు రామకృష్ణశాస్త్రిగారు భిన్న ప్రమాణాలను పాటించేవారు. అప్పుడే వెలుగులోకి వస్తున్న రచయిత లేదా దర్శకుడిని ప్రోత్సహించేవిధంగా సమీక్ష వుండాలని కొద్ది పేర్తు తెచ్చుకుని ఇంకా పైకి పోగల అవకాశాలు వున్న రచయిత రచించిన కావ్యాన్ని లేక దర్శకత్వం వహించిన సినిమాను సమీక్షించేట్టుగా కాక హెచ్చరికగా అతన్ని అప్రమత్తం చేసే[illegible]గా ఆయా సమీక్ష జరగాలని బాగా పేరు తెచ్చుకున్న రచయిత కావ్యాన్ని లేదా దర్శకత్వం వహించిన చిత్రాన్ని సమీక్షించేటప్పుడు వారి లోపాలపట్ల కరకుగా వుండాలని రామకృష్ణశాస్త్రిగారు భావించేవారు.

ఆయన కొవ్వలి వారు రాసిన కాలక్షేపం నవలలూ చదివేవారు. అంతకన్న సీరియస్ నవలలూ, కావ్యాలు చదివేవారు. అర్ధరాత్రి ఏకాంతంలో గంభీరమైన వేదాంతగ్రంథ అధ్యయనంలో నిమగ్న మయిపోయేవారు. అదే విధంగా ఆయన స్నేహితులలో, సన్నిహితులలో అన్ని రకాలవారు వుండేవారు. ఆయన బాలా త్రిపురసుందరి ఉపాసకులు మంత్ర శాస్త్రాన్ని అధ్యయనం చేశారు. తన జీవితాన్ని తామరాకు మీద నీటిబొట్టులా గడిపేవారు.

అన్నిటినీమించి రామకృష్ణశాస్త్రిగారు సహృదయుడు ఇందుకు నా అనుభవమే తార్కాణం. కృష్ణా పత్రికలో నేను సబ్ ఎడిటర్‌గా పనిచేస్తున్న రోజులు (1957) అప్పుడే రామకృష్ణశాస్త్రిగారి కథలను విశాలాంధ్రవారు సంపుటాలుగా తీసుకువచ్చారు. ఆ పుస్తకాలు కృష్ణా పత్రికకు సమీక్షగా వచ్చాయి. వాటిని నేనే సమీక్షించ వలసి వచ్చింది. సంపాదకులు కమలాకర వెంకటరావు గారు, పబ్లిషర్ ఆర్.డి.యల్. నరసింహామూర్తిగారు యిచ్చిన స్వేచ్ఛతో పుస్తక, సినిమా సమీక్షలలో యువకుడినైన నేను ఒకవిధమైన "దూకుడు" ను ప్రదర్శించేవాడిని. రామకృష్ణశాస్త్రిగారి శైలి, ఇతివృత్తం నాకు అంత నచ్చలేదు (అప్పటి నా చిన్నబుర్రకు అర్థం కాలేదని తర్వాత గ్రహించాను) తీవ్రంగా విమర్శిస్తూ సమీక్ష చేశాను. మరొకరయితే నామీద దుర్దిడిలా మండిపడేవారు. విమర్శకునికి ఏమీ తెలియదని శాపనార్థాలు పెట్టేవారు. ఇటువంటి అనుభవాలు నాకు ఆ రోజులలో తరచు ఎదురవుతూవుండేవి. కాని రామ కృష్ణశాస్త్రిగారు నా సమీక్షను చాలా తేలికగా స్వీకరిం చారు, సహృదయంతో మన్నించారు.

ఆ తర్వాత మచిలీపట్నంలో నేను చుక్కాని పత్రికను నిర్వహిస్తున్న రోజులలో అడిగిన దే తడవుగా "సంజ దీపం" అనే చక్కని కథను రిజిష్టరు పోస్టులో పంపారు. ఇంతకు మించిన సహృదయకత్వం ఎక్కడ వుంటుంది కనుక ! ○



# ధా  కా  ంతులు కా

"జాతి గౌరవంబు నీతిపై నిలుచును
నీతి లేకయున్న జాతి చెడును
నీతి గల్గు జాతి నిజమైన జాతిరా
వినుము భారతీయ వీరసుతుడ"

మానవజాతి యొక్క గౌరవము నీతి నిజాయితీలతో కూడిన మానవత్వంపై ఆధారపడి వుంటుంది. కనుక ఈనాడు విద్యార్థులు పోషించుకోవలసినది మానవత్వం. మానవులకు మానవత్వమే శృంగారము. ఎన్ని విద్యలు నేర్చిన, ఎంతటి వైజ్ఞానికుడైన, ఎంతటి పదవుల నేలినా మానవత్వాన్ని అభివృద్ధి గావించుకోవాలి. మానవత్వమును ఎంతెంత అభివృద్ధి గావించుకుందుమో సమాజము, రాజ్యము, దేశము అంతంత అభివృద్ధి అవుతుంది. మానవత్వమే కోల్పోయిన సమాజము యొక్క గౌరవము పోతుంది. ఈ మానవత్వము ఆధ్యాత్మిక [illegible]ణమునందు మాత్రమే అభివృద్ధి రాగలదు. అన్యవాతావరణములందు అభివృద్ధి అగుటకు అవకాశములేదు. విత్తనము మట్టిలో నాటి నీరు పోసి నప్పుడే అది మొక్కై, వృక్షమై ఫలము లభిస్తుంది. అట్లు కాక బీజములు ఒక టిన్నులో పెట్టి నీరు పోస్తే కుళ్ళిపోతుంది. నీతి నిజాయితీలు మానవహృదయము నందు మాత్రమే అభివృద్ధి అగుటకు అవకాశమున్నది. మానవత్వానికి, సద్గుణములకు ఆధారము నీతి. నడత యొక్క పరిశుద్ధతయే నీతి. నీతి మానవుని ఉన్నత స్థాయికి గొనిపోతుంది. ప్రాచీన కాలమునుండి అన్ని దేశములకు ఆధ్యాత్మిక సంపత్తితోపాటు నీతినిజాయితీలను బోధించిన దేశము భారతదేశము. నీతి నిజాయితీలే భగవంతుని సత్యనిలయాలు, నిత్యనిలయాలు. నీతియే లేకుండిన మానవజాతియే చెడిపోతుంది. ఈనాడు దేశమునకు అవసరమైనది నీతియే. ఈ నీతి ఇంద్రియ నిగ్రహముచేత అలవడుతుంది. ఎవరిని వారు శాసించుకో తగిన శక్తి కలిగినవారే ఇతరులను శాసించటానికి అధికారులౌతారు. తనను తానే శాసించుకోలేని బలహీనుడు ఇతరులను ఏ రీతిగా శాసించగలడు? తన మాట తన ప్రవర్తన రెండింటిని ఏకం గావించే జీవితమును గడపాలి. ఈ విధంగా మాట క్రియ ఏకమైనప్పుడే తాను మహత్తరమైన విభూతులను అనుభవించగలడు.

## శ్రీసత్యసాయిబాబా

"మాట చెప్పినట్లు మనుజుండు నడచిన
మనిషి కాడు వాడు మహితుడగును
మాట చెప్పినట్లు మనిషి నడువడేని
మనిషి కాడు వాడు మృగమె కాని"

ఈనాటి మానవ సమాజంలో మాటకు, క్రియకు సంబంధంలేదు. మాట క్రియతో కూడిన సత్యం. మనసు మాటతో కూడిన ఋతము. విద్యార్థులు దేహాభిమానాన్ని, దేశౌన్నత్యాన్ని మనసు నందుంచుకొని ప్రవర్తనయందు ఆదర్శ జీవితాన్ని అందించాలి. ఈనాటి విద్యార్థులకు ఇంద్రియనిగ్రహమంటే ఏమిటో తెలియదు. దీనికి సంయమము అని పేరు. సంయమము మానవునికి మాత్రమే చెందినది. ఇంద్రియములను అనుసరించి స్వేచ్ఛా విహారం జరపడంచేత మానవుడు తన దివ్యత్వాన్ని కోల్పోతున్నాడు. ఇట్టి ఇంద్రియ

# శ్రీ సాయి వా

రాతియందు దేవుని చూడు, దేవుని రాయిగా చూడకు.

రామార్పణం అంటారు, రాగార్పితం చేస్తారు.

రెండు దుఃఖముల మధ్య విరామమే సుఖము.

రెండు సుఖముల మధ్య విరామమే దుఃఖము.

రోషమే దోషాలకు మూలము.

లోకాన్ని తృప్తిపరచడం కాదు, లోకేశుని తృప్తిపరచండి !

లోకములో విషయగ్రస్తులు ఎక్కువ, విచార గ్రస్తులు తక్కువ.

లోకమునకు శాస్త్రములు నేత్రములు.

లోకేశుని వశం చేసుకుంటే లోకమే వశమవుతుంది.

లోభము క్షోభమునకు హేతువు.

లోభి విశాలత్వమును గుర్తించడు.

లోభికి ఎక్కడ వెదకినా భగవంతుడు కనిపించడు; త్యాగికి సర్వత్రా కనిపిస్తాడు.

నిగ్రహమునకు సంస్కృతమునందు "దమము" అని పేరు. ఈ దమమును సాధించినవాడే దాంతుడు. ఈనాడు లోకానికి దాంతులు కావాలి కాని వేదాంతులు అక్కరలేదు. ఈనాటి వేదాంతము మాటలలో మాత్రమే జరిగిపోతున్నది. వాచాలత్వము అధికమైపోతున్నది. ఆడంబరములు అధికమైపోతున్నాయి. ఆచారములు సన్నగిల్లుతున్నాయి. కనుకనే ఆనందము శూన్యమైపోతున్నది.

కనుక ప్రతి విద్యార్థి దాంతుడు కావాలి. ఈనాటి విద్యార్థులలో వినయమన్నది ఏ మాత్రం లేకుండా పోతున్నది. పెద్దలతో ఏ విధంగా సంభాషించాలో, ప్రవర్తించాలో తెలియటంలేదు. ఇది విద్యార్థుల దోషం కాదు. తల్లిదండ్రులు, గురువులు తగిన ఉత్సాహ ప్రోత్సాహములు అందించకపోవటంచేతనే విద్యార్థుల పరిస్థితి ఈ విధంగా దిగజారిపోతున్నది. ఈనాటి పిల్లలకు చిల్లర అల్లరి మాటలే చాలా అభిరుచి. ఇదే వారికి మోజు, పోజు. మంచి మాటలంటే వారికి గిట్టదు. ఆధ్యాత్మికమంటే హాస్యాస్పదంగా భావిస్తారు. ఈ విధమైన వాతావరణము దినదినానికి అభివృద్ధి గాంచుతున్నది. విద్య ఉద్యోగాల నిమిత్తమనే, ధనార్జన నిమిత్తమనే దుర్భావాన్ని దూరంగావించుకోవాలి. విద్య జీవితపరమావధి నిమిత్తమనే సత్యాన్ని మరువకూడదు. జీవనోపాధి నిమిత్తమై ఉద్యోగము నాచరించవలసినదే. ఆ ఉద్యోగమునందు మాత్రం నీతిని నిజాయితీలను విడువరాదు. ఈనాడు విద్యయొక్క ప్రధాన లక్ష్యము ధనార్జన కావటంచేతనే విద్యా విలువలు శూన్యమైపోతున్నాయి. చదువులు ఏర్పడినది దీని నిమిత్తము కాదు. విద్య జ్ఞాన నిమిత్తము. ధనముకానీ, విద్యకాని చెడ్డవి కావు. మనం వినియోగించుకునే విధానము లోపల వాని గౌరవమర్యాదలు నిలిచి ఉంటాయి.

విద్యార్థులారా ! మనము ఎంత గాలిని పీల్చుకుంటున్నామో అంత గాలిని విడువక తప్పదు. విడువకుండిన మన ఊపిరితిత్తులు దెబ్బతింటాయి. ధనము సంపాదించవలసిందే. విద్యను నేర్చవలసిందే. సంపాదించిన ధనమును సమాజమునకై సద్వినియోగపరచాలి.చదివిన చదువును సమాజంలో ప్రవేశపెట్టి తద్వారా ప్రజలకు ఆనందాన్ని అనుకూలతను అందించాలి. ఆ విధంగా సద్వినియోగపరచకుండిన ఇది మట్టితో సమానమే. మనము ఏ సమాజమునుంచి ఆర్జించామో, ఆ సమాజమునకు తిరిగి అర్పితము గావించాలి. అదే నిజమైన సేవ. విద్యార్థులయందు ఈ త్యాగభావము కనిపించటంలేదు. ప్రోగు చేసుకోవటం, ప్రోగు చేసుకోవటంలోనే జీవితం వ్యర్థమైపోతున్నది. ఇది "వన్‌వే ట్రాఫిక్" గా చేస్తున్నారు. తీసుకున్నదానిని తిరిగి వినియోగించాలి, తిరిగి

అందించాలి. అప్పుడే జీవితంలో ఉన్నత స్థాయికి చేరగలము. ఈనాడు త్యాగం చేయవలసినది ధనమును మాత్రమే కాదు. మన దుర్గుణములను త్యాగం చేయాలి. ఇదియే నిజమైన త్యాగము. "భావమందు దుష్ట వాంఛలు వీడుటే త్యాగమగును, అదియె యోగమగును. ఆస్తి ఆలి వీడి అడవి కేగుట కాదు". ఆలుబిడ్డలను వీడటం, ధనధాన్యములను విసర్జించటం గొప్ప త్యాగమేమీ కాదు. మనసులోని దుర్గుణాలను వదలటమే నిజమైన త్యాగము. అప్పుడే మానవత్వం పరిపూర్ణంగా రూపొందుతుంది.

మానవుడు మానవుడుగా జీవించటానికైనా ప్రయత్నం చేయాలి. మానవత్వాన్ని పశుత్వంగా అనుభవించటం మానవత్వానికే తీరని కళంకం. విద్యార్థులు మొట్టమొదట భద్రమైన గుణములను అభివృద్ధి గావించుకోవాలి. గుణమే లేకుండిన జీవితములో శాంతియే వుండదు. మనము సమాజములో పుట్టినాము, సమాజములో పెరిగినాము, సమాజములోనే మన జీవితాన్ని గడుపుతున్నాం. సమాజమే లేకపోతే మన జీవితమే లేదు. కాని దురదృష్టవశాత్తు ఈనాటి మానవుడు నేను, నా కుటుంబము అనే స్థాయి యందే నిలిచిపోతున్నాడు. సమాజం పరకు ప్రయాణం చేయటంలేదు. అట్టి జీవితం గడపటం చేతనే శాంతి సౌఖ్యములు దూరమైపోతున్నాయి. భక్తునికి కూడను మొట్టమొదట తనపనే ముఖ్యమవుతున్నది. స్వార్థము! స్వార్థము! తరువాతనే దైవముయొక్క పని. కనుకనే మానవుడు ఆనందాన్ని అందుకోలేకపోతున్నాడు, అనుభవించలేకపోతున్నాడు.

భగవంతుని తత్వాన్ని విస్మరించి, భౌతికమైన, లౌకికమైన జగత్తును ఆశ్రయించినవారు కౌరవులు. కౌరవులకు ఎంతో సిరిసంపదలుండినప్పటికినీ కట్టకడపటికి ఏమైపోయినారు? భీష్మ, కృపా, ద్రోణాచార్యుల లాంటి మహావీరులు, ధీరులందరూ కౌరవుల పక్షమే నిలిచారు. అయినప్పటికీ వారి భుజబలం, ఆయుధబలం

## మంజువాణి

పూలకట్టి ఉంచు, పూసల సరిజేయు
సూత్రమొకటె జాతి సుగుణమదియె
జాతి చెదిరిపోవు, జాతీయత నశింప
మమ్ము బ్రోవుమమ్మ మంజువాణి!

తాను కాలిపోతు తమమునే హరియించు
కరగిపోతు వెలుగు కలుగజేయు
త్యాగధనుల బ్రతుకు తనరారు దీపమై.
మమ్ము బ్రోవుమమ్మ మంజువాణి!

కనులు కానలేవు, కర్ణమ్ములు వినవు,
ఉలుకు పలుకు లేక ఊరకుండు
చిత్రమైన జబ్బు సిరులతో వచ్చెను
నుమ్ము బ్రోవుమమ్మ మంజువాణి!

— భైరవభట్ల దేవీప్రకాష్

వారికి ఏ మాత్రం ప్రయోజనం లేకుండా పోయింది. దైవబలము, ధర్మబలము పైననే ఆధారపడినారు పాండవులు. ధర్మమును ఆశ్రయించినప్పుడే దైవం మనకు లభ్యమవుతాడనే విషయం భగవద్గీత సుస్పష్టంగా చెప్పింది. మొట్టమొదట ధర్మక్షేత్రే, కురుక్షేత్రే అని ధర్మంతో ప్రారంభించబడి, కట్టకడపటికి విజయంతో అంతం గావించాడు. ధర్మంతో ప్రారంభించి విజయముతో ఆనందాన్ని అనుభవింపచేశాడు అర్జునుకు. ఏ చిన్న కార్యముకైన పాండవులు పరమాత్ముని ముందుంచుకొని ప్రవేశించేవారు. కౌరవులు అట్లు కాదు. తమ స్వార్థము, స్వప్రయోజనాన్ని ముందుంచుకొని భగవంతుని వెనుక నుంచేవారు. కనుకనే వారికి కష్టములు, నష్టములు సంభవిస్తూ వచ్చాయి. భగవంతుని ముందుంచున్న పాండవులకు అన్నీ విజయములే

చేకూరినాయి. కష్టములు కొన్ని కలిగినాయి కాని ఆ కష్టములవల్ల వారికే మాత్రం నష్టంలేదు. కష్టపడక సుఖము ప్రాప్తించదు. కష్టే ఫలి. కౌరవులు I, I నేను! నేను! అని అహంకారాన్ని ముందుంచుకున్నారు. ఫస్ట్ 'I', నెక్స్ట్ 'World' లాస్ట్ 'God'. కనుకనే వారు అన్నీ 'Loss' అయినారు. పాండవులట్లు కాదు. ఫస్ట్ 'God'. నెక్స్ట్ 'World' లాస్ట్ 'I'. వారు అహంకారాన్ని కట్టకడపటికి చేర్చడం వలననే విజయాన్ని సాధిస్తూ వచ్చారు. కనుక అహంకారాన్ని వెనుకకు నెట్టాలి, ముందు పెట్టకూడదు.

విద్యార్థులారా! ఈ వయసులోపల మీకు అహంకారముండటం సమంజసమే. కండబలముండినంతవరకు కన్నుల్లో అహంకారబలము ప్రకాశిస్తూనే ఉంటుంది. దేనినీ లెక్కచెయ్యరు. మంచిచెడ్డలను విచారణ చెయ్యరు. పిల్లలయందు విచక్షణాజ్ఞానము ఏ మాత్రమూ కనిపించదు. వినయవిధేయతలే ప్రధానమైన విద్యగా భావించాలి. "విద్య యొసగును వినయంబు, వినయమునను కలుగు పాత్రత, పాత్రత వలన ధనము, ధనము వలనను దైవంబు" చూశారా! వినయము చేతనే మనకు దైవం లభిస్తాడు. అహంకారముతో దైవవిషయాన్ని, ధర్మవిషయాన్ని అలక్ష్యం చేసిన ఈ విధమైన దివ్యభావములు ప్రాప్తించవు. ఈ పవిత్రమైన ఈ వయసును, ఈ కాయమును, ఈ కాలమును, ఈ కర్మను సార్థకం గావించుకోవాలి. చక్కగా చదవండి! మంచి తరగతిలో ఉత్తీర్ణులుకండి! ఈ చదువును సమాజములో ఉపయోగపెట్టండి! చదువుల్లు అధికమయ్యేకొలది అహంకారం పెరుగుతూ వస్తుంది. అహంకారం పెరిగిన ఆత్మబలం తగ్గిపోతుంది. దైవభావం లేకపోవటంచేతనే ఈనాడు లోకములో మానవులు క్రూరమృగములకంటె హీనంగా ప్రవర్తిస్తున్నారు. మనకు ధనము ప్రధానము కాదు, గుణము ప్రధానము కావాలి.

ధన మెచ్చిన మద మెచ్చును
మద మెచ్చిన దుర్గుణంబు మానక హెచ్చున్
ధన ముడిగిన మద ముడుగును
మద ముడిగిన దుర్గుణంబు మానును వేమా!

అన్నారు. పదవులు, ధనము, గౌరవప్రతిష్ఠలు కదలిపొయ్యే మేఘములు. ఈ అహంకారమే మానవుని అధఃపతనమునకు కారణము. అహంకారం ఉండటం చేతనే మానవుడు తనను తానే మరచిపోతున్నాడు. తనను తానే మరచటమే పెద్ద బంధన. తనను తాను గుర్తించుకోవటమే నిజమైన సాక్షాత్కారము. జపములు, ధ్యానములు, యోగములు ఎన్ని చేసినప్పటికీ మనస్తత్వం ఏ మాత్రం మారటంలేదు. మనిషి మారినంత మాత్రమున ప్రయోజనము లేదు. మనసు మారాలి. గుణము మారాలి. దేశముయొక్క మంచిచెడ్డలన్నీ విద్యార్థులపైననే ఆధారపడి వుంది. మీరు సరియైన స్థితియందుండినప్పుడే దేశము సరియైన స్థితిని అనుభవిస్తుంది. విద్యార్థులు మంచివారై, నీతి నిజాయితీపంతులైనప్పుడే దేశం ఆదర్శవంతమైనదిగా రూపొందుతుంది. భారతదేశము అనాదికాలమునుండి ఇట్టి సత్కీర్తిని సంపాదించినది. ఆ ప్రాచీన సంస్కృతిని తిరిగి పునరుద్ధరింపజేయండి! భారతదేశము పవిత్రమైన దివ్య సందేశాలు అందించి సర్వదేశములకు నాయకత్వాన్ని వహించినట్టిది. వేద ఉపనిషత్, పురాణ ఇతిహాసములను ఆదర్శరూపములో అన్యోన్యమైన భావముతో ప్రకటించి, ప్రచురించినది భారతదేశము. కాని ఈనాడు ఆచరణరూపమైన ప్రచార ప్రబోధలు సన్నగిల్లటంచేతనే భారతీయ సంస్కృతిని గుర్తించటానికి వీలుకాకుండా పోతున్నది. భారతీయులు సత్యవ్రతులు, ధర్మపరాయణులు, న్యాయము భారతీయులకు ఆటపట్టు.

విద్యార్థులు సత్య, ధర్మ, నీతి నిజాయితీలతో జీవించటానికి తగిన కృషి చెయ్యాలి. వేదము చెప్పిన

"సత్యం వద! ధర్మం చర!" ఈ రెండింటిని ప్రధానంగా తీసుకోవాలి. దేశాభిమానాన్ని మీరు ఏనాడు వదలకూడదు. ఏయే దేశాలవారు ఆయా దేశాభిమానము పెంచుకొనుటలో తప్పులేదు. ఐతే తన దేశాభిమానమును పెంచుకొని పరదేశమును విమర్శించకూడదు. ఏ మతాన్ని అలక్ష్యము చేయకూడదు, విమర్శించకూడదు. విశాలభావాన్ని పెంచుకోవాలి. సంకుచితమైన భావాలను త్యజించాలి. ఇది భారతీయుల నిజమైన సంస్కృతి.

"పరమపావనమైన భారతావనియందు
సహనమన్నదె మనకు చక్కదనము
వ్రతము లన్నిటియందు వన్నె గాంచినయట్టి
ఘన సత్యశీలమే కఠిన తపము"

నిజముగా ఈ పవిత్ర దేశము ఘనతను ఎంత వర్ణించినా సాధ్యం కాదు. తల్లి ప్రేమకంటె అమితమైన ప్రేమను అందించునట్టిది ఈ దేశము. ఇలాంటి పవిత్రమైన దేశాన్ని మనం ఎప్పుడూ విస్మరించరాదు. దేశాభిమానాన్ని పెంచుకొని, దేశము యొక్క గౌరవాన్ని, దేశము యొక్క సంస్కృతిని, దేశము యొక్క ఔన్నత్యాన్ని కాపాడాలి.

విద్యార్థులారా! ఎవరు ఏ విధముగా తూలనాడినా, హాస్యాస్పదముగా చూచినా భగవద్భక్తిని వదలకండి. భగవత్ప్రేమే లేకపోతే ఈ జగత్తంతా శూన్యము. ప్రేమయే భగవంతుడు, భగవంతుడే ప్రేమ. ఈ ప్రేమను మీరు పెంచుకోండి! కష్టములు, నష్టములు, విచారములు, దుఃఖములు ఎన్ని వెంటాడినప్పటికీ ప్రేమను వదలకండి! అదే మీ వెంట, జంట, ఇంట, కంట ఉంటుంది. మిమ్ములన్ని కాపాడుతూ వస్తుంది. కష్టములు వచ్చినాయని భగవంతుని నిందించకూడదు. భగవంతుడు ఏ నిమిత్తమై, ఏ కారణంచేత కష్టాలు కలిగించాడో, అది కూడను అనుగ్రహ ప్రసాదమనే భావించాలి. జీవితము సుఖదుఃఖములకు మధ్యలో ఉండి నటువంటిది. మీరు ఈ ప్రాకృతమైన బాధలను

## తెలుసా?

హైద్రాబాద్‌లోని నెహ్రూ జూలాజికల్ పార్కు ఆసియాలోని అతి పెద్ద జంతుప్రదర్శనశాలగా పేరొందింది. ఇక్కడి లయన్ సఫారీ పార్కు దేశంలో మరెక్కడా లేదు.

* మన దేశంలో మొదటి జనపనారమిల్లు 1856లో "ఆక్లండ్" అనే ఆంగ్లేయునిచే కలకత్తా సమీపంలోని "రిష్రా" వద్ద స్థాపింపబడింది.

* బ్లాక్ సాలమండార్ అనే ఓ రకం బల్లి జాతి జీవి ఎత్తయిన పర్వత ప్రదేశాలలో కనిపిస్తుంది. దీని గర్భధారణ మిగిలిన అన్ని జీవులకంటెను ఎక్కువ. సుమారు మూడున్నర సం.లు.

* బాక్టీరియాలవల్ల వచ్చే వ్యాధుల్ని నివారించుటకు యాంటీబయోటిక్స్ మందుల్ని వాడతారు. మొట్టమొదట యాంటీబయోటిక్ "పెన్సిలిన్" ను 1928లో అలెగ్జాండర్ ఫ్లెమింగ్ కనిపెట్టాడు యాంటీబయోటిక్స్ శరీరానికి ఏ విధమయిన హాని కలిగించకుండా సూక్ష్మజీవుల్ని నశింపజేస్తాయి విశేషమేమంటే వీటివలన మానవాళికే కాక పురాతన కట్టడాలు కూలిపోకుండా కాపాడటానికి వీటిని వాడుతున్నారు. పశువుల ఆహారంలో కలిపితే ఆ ఆహారంలో క్రొవ్వు శాతం పెరుగుతుంది,

ఏ మాత్రం లెక్క చేయకుండా భగవద్భావాన్ని, భగవద్విశ్వాసాన్ని దృఢముగా కలిగిఉండినప్పుడు ఎన్నైనా సాధించవచ్చును. ఎలాంటి పరిస్థితులయందైనా భగవన్నామాన్ని మరువకూడదు. ఆ నామమే మీ జీవితప్రవాహములో నావగా తోడ్పడుతుంది. కనుక నామస్మరణ చేయండి!

(బెంగుళూరులో జరిగిన శిక్షణా తరగతులలో ది 2–6–1990 న భగవాన్ బాబా చేసిన దివ్యప్రసంగము నుండి)

# శ్రీ సత్యసాయి గీతా భాష్యము

( గత సంచిక తరువాయి )

భగవత్ సృష్టి చక్రము సక్రమముగా నడువవలె నన్న ప్రతివాడునూ కర్మ చేసియే తీరవలెను. పెద్దవారు జ్ఞానులు, అనుభవజ్ఞులు సహితము కర్మలు చేయుచు, సామాన్య మానవునికి, అజ్ఞానికి మార్గదర్శిగా నుండ వలెను. చెట్టు, చేమ, చీమ, దోమ, రాయి, రప్ప, గాలి, వాన, ఎండ, చలి, ప్రతి ఒక్కటియూ కర్మలుచేయుచునే యున్నవి. సూర్యచంద్రాదులు కర్మలు చేయకుండిన మానవుల గతి ఏమై యుండెడిది! అట్లే బ్రహ్మాండమైన విశ్వకర్మను నేను చేయనవసరంలేదని నేనూరకుండిన ఈ విశ్వమేమై యుండెడిది అని కృష్ణుడు కర్మాచరణను గురించి వచించెను. ఏమి చేయవలెనో ప్రధానం కాదు.

## తూ ము లూ రి ప్ర భ

ఎట్లు చేయవలెనో తెల్సుకొనవలెను. ప్రతి వ్యక్తి తమ తమ విద్యుక్తధర్మమును, దైవదృష్టితో, దైవ మును స్మరించుచు, ఫలాపేక్ష లేక, ఈశ్వరార్పణ బుద్ధితో చేయవలెను. అప్పుడు ప్రతి కర్మ పవిత్ర కర్మగా మారును. అందుచే మానవుడు చేయవలసినది కర్మ త్యాగము కాదు. కర్మను వదలవలసిన పనిలేదు. దానిని పవిత్రమొనర్చు పద్ధతిని మాత్రము నేర్చుకొన వలెను. మానవుని వాసనలే కర్మయెడల, ఫలముల ఎడల ఆసక్తి కల్గించును. జీవనమరణచక్రానికి మూల కారణమైన వాసనాదులనుండి కలుషితం కాని కార్యక్రమ మును, కర్మను మానవునకు గీత బోధించుచున్నది. ఫలాపేక్షను వదలి, కర్మను చేయుటయే సక్రమ పద్ధతి. అదే నిష్కామకర్మ. అది మానవుని బంధించదు.

ప్రతి కర్మ కూడనూ జ్ఞానపూర్వకంగా చేయవలెను. జ్ఞానము మానవునికి ప్రవృత్తి, నివృత్తి మార్గములను బోధించుచు, ఆస్తికతను అభివృద్ధిపరచుచూ, మానవుని ముక్తిసామ్రాజ్యమునకు నిష్కామమార్గమున కొనిపోవు చున్నది. అన్ని క్షేత్రములకూ క్షేత్రజ్ఞుడు ఒక్కడే. అట్టి క్షేత్రజ్ఞుడైన ఆత్మయే తానని తెలుసుకొనుటే జ్ఞానము. ఆత్మయే పరమాత్మయని తెలిసికొనుటే విజ్ఞానము. మానవుని మనస్సు చాలా చంచలమైనది. దానిని అరికట్టుట చాలా కష్టము. అందుచే దానిని విషయములపై పోనీయక, విషయముల వాస్తవస్వరూప మును జ్ఞానముతో విచారించి, విరక్తి భావమును పెంచుకొని, వాసనాక్షయము,మహానాశము పొందవలెను. ప్రపంచములో అనేక రకముల మనుష్యులు, అనేక మనస్తత్వములు, సంస్కారములు తదనుగుణంగా చిత్తవృత్తులను నిరోధించు పద్ధతులు (యోగములు) కూడను అనేక రకములుగా నున్నవి. అవే కర్మ, భక్తి, ధ్యాన, జ్ఞాన యోగములు. ఈ అన్నిటి సమన్వయమే భగవద్గీత. కర్మ వలన పవిత్రత, భక్తి, ధ్యానముచే ప్రకాశము, జ్ఞానముచే ఐక్యత లభించును. అన్ని మార్గముల, పద్ధతుల (యోగముల) ప్రధాన లక్ష్యము అహంకారము తొలగించుటయే. ప్రతి ఒక్కరు తన జీవితములోను, స్వకర్మవిధానము లోను, సాక్షాత్తుగా అనుభవించి తెలిసికొనగలిగే వేద విహిత సమ్మతమైన ఆదర్శములను, నియమలను కలిగియుండి, కల్లకపటము లేని అర్జునునిలా, నిజాయి తీతో, నిశ్చల స్వభావంతో భగవంతుని శరణు పొంద వలెను. విషాదయోగంతో ప్రారంభమైన గీత సన్యాస యోగంతో ముగిసింది.

భగవంతునియందు ప్రీతి కలిగియుండుట భక్తి. అనన్యభక్తి ( ఒక్క పరమాత్మ తప్ప ఇతర మెద్ది యును మనస్సునకు రాకయుండుట. ఇతరమగు దేని యందును కోరిక లేకయుండుట) కలిగి; తన్మయత్వ

ముతో అన్నీ నీవే అని నాశరహితుడగు పరమాత్మను ఎప్పుడూ ఆశ్రయించుటయే భక్తి. అట్లు ఆశ్రయించిన భక్తులకు అనుగ్రహమును ప్రసాదించి, వారి యోగ క్షేమములను భగవంతుడే చూచుకొనును. "అనన్యాశ్చిన్తయన్తో మాం, యే జనాః పర్యుపాసతే; తేషాం నిత్యాభి యుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్" (9 అ. 22 శ్లో) భగవదనుగ్రహమునకు అందరూ అర్హులే. భగవంతుని సన్నిధి కావలెననియు, అనుభవించవలెననియు, ప్రవేశము కావలెననియు ఎవరు ఆరాటపడి, నిరంతరము చింతింతురో అట్టివారందరికీ అచట చోటు కలదు. నిరంతరము నిర్మల చిత్తముతో స్మరించిన అట్టి వారి యోగక్షేమములను తప్పక భగవంతుడు చూచుకొనును. భక్తి అనునది ఎక్కడ నుండియో వచ్చి పడునది కాదు. ఎవరూ అందించునది కాదు. భూమి నుండి రాలేదు. ఆకాశమునుండి పడలేదు. తనలోనుండియే వచ్చు భగవదనురాగము. భక్తునిలోని ప్రేమప్రవాహము చెల్లాచెదరై ప్రవహించక, భగవంతునివైపు ఏకోన్ముఖముగా ప్రవహించిన అట్టి ప్రేమప్రవాహమే భక్తి అనబడును. ప్రేమ లేని జీవి లేదు. ప్రేమే జీవనము. జీవనమే ప్రేమ. ఈ ప్రేమ పరి పరి విధముల ప్రవహించుచుండును. తల్లిదండ్రుల ప్రేమ బిడ్డలపై మరలిన వాత్సల్యమని, అదే ప్రేమ దాయాదులపై తిరిగిన మోహమని, దీనులపై పడిన కరుణ అనీ, సమానులపైన మైత్రి అని, వస్తు వాహనాదులపై ఇచ్ఛ, వాంఛ అని, పరి పరి విధముల నామములతో నుండును. ఆచార్యులపై గౌరవము, వినయము, విధేయత అందురు. ఒక్క భగవంతునిపై మాత్రము భక్తి అందురు. చాలా చీలికలుగ ఏర్పడి, క్షీణించి, ఎందుకూ కొరకాక, అశాంతి, దుఃఖములకు చిక్కుకొని విలపించుటకంటె, ఏకముఖమున తన ప్రేమ ప్రవాహమును భగవత్ అనుగ్రహమను సాగరమును చేరునట్లు చేయు సాధనే భక్తి. భక్తి పరిశుద్ధమైన గంగ వంటిది. కర్మ యమున వంటిది. జ్ఞానము గుప్తగామినియైన సరస్వతి వంటిది. ఈ

మూడింటి సమ్మేళనం - త్రిగుణముల ఏకత్వమే - మనోలయము. అదియే మమకార రహితము.

తానే నేను, నేనే తానను స్థితి-అహం బ్రహ్మాస్మి.

...్యం, నిరంతరం - అనన్య భావన - పరమాత్మ చింతన వలన మనస్సుయొక్క మాలిన్యము పోవును. మాలిన్యరహితమైన మనస్సు కలిగియుండుటే భక్తుని

## తమసోమా జ్యోతిర్గమయ

ఎక్కడ మానవతా పూదోట
మమత మొగ్గలు తొడిగి
ఆత్మీయతా జ్ఞాన సుగంధాలతో
తనువును స్పృశిస్తుందో
ఎక్కడ హృదయ వీణా తంత్రి
సుఖానంద నిక్వాణమై
మధుర స్వరాల గీతాలు పలికే
వేణువై రవళిస్తుందో -
ఎక్కడ జాతీయ సమైక్యతా భావం
శాంతి కాంతి సమన్వితమై
అంధాచార మత మౌఢ్యాలను
ఆవలకు నెట్టివేస్తుందో -
ఎక్కడ స్వార్థం సౌహార్దంగా పలకరిస్తుందో
ఎక్కడఅసూయ ఆప్యాయతగాపులకరిస్తుందో
ఎక్కడ ద్వేషం స్నేహంగా పరిమళిస్తుందో
ఎక్కడ క్రోధం కరుణగా ప్రభవిస్తుందో
అక్కడకు ... ఆ దివ్య ధామంలోకి
ఆ చిర యశస్తీరంలోకి
నడిపించు ... నడిపించు ...
ఈ మనుషుల్ని ... మనసుల్ని .

సి. కామేశ్వరరావు

## చైతన్యవా

గురువులను తెప్పించి కేవలం ఉపన్యాసాలు ఏర్పాటుచేయటమే ముఖ్య కర్తవ్యంగా పెట్టుకున్నవారి వ్యాసాంగమును చూసినపుడు వారిపై వున్న ఆ గౌరవం తగ్గిపోతుంది.

సమాజంలో అలసత్వం గలవారున్నారు. కాని మీలో జాగ్రత్త అవుసరం. సమాజంలో సోమరులున్నారు. మీలో క్రియాశీలత్వం అవుసరం. సమాజంలో మతిమరుపు గలవారున్నారు. మీలో జ్ఞాపకశక్తి అవుసరం. సమాజంలో జడత్వం వుంది. మీలో చైతన్యం పెల్లుబకాలి. లేనిచో సమాజానికి మీరేమి చేయగలరు ? సమాజాన్ని మీరెలా మారుస్తారు ? గురువచనానికి న్యాయం చేకూర్చలేని మీరు శాస్త్రవచనానికి న్యాయమెలా చేయగలరు ?

వయస్సులేని శైశవమున బిడ్డకు తల్లిపాలు శక్తినిచ్చును. వయస్సు పెరిగిన వర్ధమాన దశలో వ్యక్తికి గీతాక్షీరము అమృతానందము నొసంగును.

సేకరణ : మల్లాది సూరిబాబు

ౘ

లక్షణము. భక్తుని మొదటి లక్షణము - ద్వేషము లేకుండుట. రెండవ లక్షణము మైత్రి కలిగియుండుట. దీనులయందు, దుఃఖితులయందు కరుణ కూడా ఉండవలెను. దీనికి నిర్మమః, నిరహంకారః అను రెండునూ భక్తుడు తనలో లేకుండ చేసికోవలెను. భగవత్ భక్తుడు కాగోరువారు "సతతం సంతుష్టిః" అనగా భోగమందు కానీ, రోగమందుకానీ, నష్టమందు కానీ, ఆదాయమందు కానీ, దుఃఖమందు కానీ, సుఖమునందు కానీ ఏది ప్రాప్తించినను సంతుష్టుడైయుండవలెను. వాంఛా ఫల సిద్ధి యందును, అఫలమందును మనస్సు చలించకుండా చూచుకోవలెను. అనన్య చింతన లేక, భగవంతుని ఉపాసన జరుపక, అతని శరణు పొందక, తన యోగక్షేమములు మాత్రము చూచుకొనలేదే అనిన, యెంత అజ్ఞానము. పరులను శరణు జొచ్చి, పరులను కొల్చుచూ అన్య చింతలతో ఉండువాని యోగక్షేమము భగవంతుడెట్లు చూచును. పోనీ, పరులయందు పరమాత్మ భావముంచి, సర్వ కర్మలు భగవదర్పితమనియైననూ తలంచిన పరమాత్ముడు అనుగ్రహించును. ఆశ్రయించుట అన్యులను, ఫలితమాశించుట పరమాత్ముని. ఇది అనన్య చింత యెట్లగును? అభిమానము, ఆశ్రయము రెండునూ ఒకటియైన అది శరణాగతమనబడును. పరమాత్మ చింతన వలన మనస్సుయొక్క మాలిన్యము వీడును. అట్టి మాలిన్య రహితమైన మనస్సు కలిగి యుండుటే భక్తుని లక్షణము. మానవుడు తన చూపులు ఆటలు, పాటలు, మాటలు అన్నియు భగవత్ మయము చేయుటే ముఖ్యము. ఇట్టివారు ప్రత్యేకించి యజ్ఞయాగాదులు కానీ, దానధర్మాదులు కానీ, క్షేత్రయాత్రలు కానీ చేయలేకపోతిమే, పోనీ చేయుటకు శక్తిసామర్థ్యములైనను పరమాత్ముడు ప్రసాదించలేదే అని విచారించనక్కరలేదు. పరమాత్ముడు ఇవి ఏనాడూ కోరలేదు. నిర్మల మనస్సు కలిగియుండి, ఏమి అందించిననూ, ఆనందముగా అందుకోగలడు. భక్తుడు తన భక్తిచే భగవంతుని తెలిసికొనగలడు (భక్త్యామామభి జానాతి). అందుచే భక్తియోగము సర్వులకు అందుబాటులోనున్నది. చాల సులభమైనది. ప్రతిభ కలది. భగవంతునిపై నిష్కళంక ప్రేమ తప్పక కఠిన సాధనమేమియు లేవు. హృదయక్షేత్రమునందు కరుణ, ప్రేమ, మైత్రి, ద్వేషరాహిత్యము మొదలగు సుగుణములను పెంపొందించుకొని,భగవంతునికి అర్పించిన భగవంతుడు ప్రసన్నుడగును. ఇదే పరాభక్తి. ఇట్టి పరాభక్తితో పరమేశ్వరుని సాక్షాత్కారము (విశ్వరూప దర్శనము) చేసికొన అర్హుడవుతాడు. కనీసం ఫలపుష్పాదులతో (పత్రం, పుష్పం, ఫలం, తోయం) చేయు సామాన్య పూజ అయినను అనన్య భక్తితో, నిర్మల చిత్తముతో ఒసంగిన భగవంతుడు ప్రీతితో స్వీకరించును. వారిని భగవంతుడు అనుగ్రహించి, ఆత్మజ్ఞానమును ప్రసాదించును. ( సశేషం )

మేజువాణి

# ★ "మందు" భాగ్యులు ★

ప్రతి నిత్యం పెరిగిపోతున్న ప్రపంచ జనాభాలో ఎన్ని తెగల మనుష్యులున్నా - వాళ్ళందర్నీ రెండే రెండు రకాలుగ విభజన చేయవచ్చును. భాగ్యవంతులు భాగ్యహీనులు, లేదా ఉన్నవాళ్ళు - లేనివాళ్ళు లేదా కలవాళ్లు - కలలవాళ్లు! మొదటిరకం వారిది వడ్డించిన విస్తరిలాంటి జీవితమైతే - రెండో రకంవాళ్లు - అంటే నిర్భాగ్యులు, దౌర్భాగ్యులు, అభాగ్యులు, మందభాగ్యులు లాంటి కోవకు చెందినవాళ్ళను దురదృష్టం వెంటాడు కుంటూ వస్తుంది! అదృష్టం అంటే కనపడకుండ వచ్చి చేరే భాగ్యం అన్నారమధ్య ఎవరో! ఆ లెక్కన దురదృష్టం అంటే కూడ కనపడకుండ వచ్చి చేరే దౌర్భాగ్యమన్న మాట! అలాంటి దౌర్భాగ్యుల గురించి, మందభాగ్యుల గురించి మరోసారి ముచ్చటించు కుందాము! ప్రస్తుతానికి ప్రతి నిత్యం మనకు తారస పడే "మందు" భాగ్యుల గురించి ఒక్కసారి విచారిద్దాం!

మందేసుకున్నావా బాబూ!

మల్లాయపురం మల్లయ్యగారని ఓ మారుమూల కుగ్రామంలోని ముప్పై ఎకరాల సుక్షేత్రానికి హక్కు దారుడు! ఆయనగారి ముద్దులబిడ్డడు కాలేజీ చదువులకని బస్తీ కెళ్ళినప్పటినుంచీ మందు కొట్టడానికి అలవాటు పడిపోయాడు! అది శృతి మించి రాగాన పడడంతో ఆరోగ్యం అనారోగ్యంగా మారింది! దాంతో చదువు మాట దేముడెరుగు - బతికుంటే మరో పది బీరు బాటిల్సు లాగించవచ్చుననుకుంటూ అతగాడు హుటా హుటిన యిల్లు చేరాడు. రైలుప్రమాదం జరగ్గానే హుటాహుటిన అక్కడకు చేరిన రైల్వేమంత్రిలా - ఇంతకాలం లంక పొగాకు చుట్ట తప్ప మరే రకం తెలియని ఆ అయ్య - అబ్బాయి వాలకం చూసి హడిలి పోయాడు! ఊళ్ళో ధన్వంతరాచార్యులుగార్ని పిలిచి చూపించాడు! ఆయన వచ్చాడు - కళ్ళు చూశాడు - నాలుక చూశాడు - నాడి చూశాడు - ఒక్క దీర్ఘశ్వాస విడిచి రోగనిర్ణయం చేసి ఏవో కషాయాలు, మాత్రలు వగైరాలు యిచ్చి పత్యం ఎలా చేయాలో చెప్పాడు. అబ్బాయిగారి నోరు ఆల్కహాలుకు అలవాటు పడిపోయింది. ఈ కషాయాలు, అరిష్టాలు, చూర్ణాలు ఏం మింగుడు పడతాయి? పైగా యింటికొచ్చిన దగ్గర్నుంచీ ఒక్కటంటే ఒక్క పెగ్గన్నా దొరకడం లేదు, దాంతో పేగులు తోడేస్తున్నట్లు మనసంతా ఎలాగో అయిపోయింది. ఆచార్యులుగారిచ్చిన మందులు, మాత్రలు అలాగే ఉన్నాయి. నాల్గు రోజులు గడిచినా అబ్బాయిలో ఉత్సాహం రాలేదు. ఆచార్యులుగారొచ్చి చేయి పుచ్చుకుని నాడి చూశారు. ఏం అనుమాన మొచ్చిందో ఏమో.

## సోమంచి రామం

"మందేసుకున్నావా బాబూ?" అంటూ అడిగారు.

"ఎక్కడండీ? ఈ అయిదారు రోజుల్నించీ అది దొరక్కే యిలా డీలా పడిపోతున్నాను" అంటూ బావురుమన్నాడు ఆ మందు భాగ్యుడు.

లిమిటెడ్ మందు

ఇంతకీ చెప్పొచ్చేదేమిటంటే- ఆ కుర్రాడి దృష్టిలో మందంటే బ్రాందీ, విస్కీ లాంటి మద్యాలే! ఆ కుర్రాడి దృష్టిలోననే ఏం ఖర్మ? ఈ రోజుల్లో మందు కొట్టడమనేది పారిభాషిక పదమయిపోయింది. ఈ మందు కొట్టడమనేది సాంఘిక దురాచారమని మొరార్జీ భాయి లాంటివాళ్లు నెత్తీ నోరు కొట్టుకొని నెత్తిన గుడ్డేసుకుని వెళ్ళిపోయారు! అదీ మందు మహాత్యం!

( తరువాయి 36వ పేజీలో )

# నోములు, వ్రతాలు

-సాయిప్రియ

"పద్మాసనే పద్మకరే సర్వలోకైక పూజితే
నారాయణప్రియే దేవి సుప్రీతాభవ సర్వదా"

శ్రావణలక్ష్మి వచ్చింది. ఎంతో అందంగా, అతి సుందరంగా, క్రొత్త పెండ్లికూతుళ్ళతో, అల్లుళ్ళతో, వియ్యాలవారితో గృహస్థుల ఇళ్ళన్నీ కళకళలాడుతూ కిలకిలలాడుతున్నాయి. మంగళగౌరీవ్రతం, వరలక్ష్మీ వ్రతం, శ్రావణపూర్ణిమ (రాఖీ పండుగ) సందడి.




ఒకటేమిటి? అన్నీ పండుగలే. ఉరుములతో, మెరుపులతో, దట్టమైన మేఘాలతో, వచ్చిపోయే జల్లులతో వచ్చింది శ్రావణి. గ్రీష్మతాపంతో అలసి, సొలసియున్న జనులకు తొలకరిజల్లులు తెచ్చాయి మనశ్శాంతిని రైతన్నలకు యిచ్చాయి ఆనందం. బావులు, చెర్వులు నిండి కప్పల బెకబెకలు ఒకప్రక్కనైతే, వచ్చిపోయే చుట్టాలతో ప్రతి ఇల్లూ సందడే. క్రొత్తగా పెండ్లయిన ఆడపిల్లలు పట్టుచీరెలు కట్టుకొని, చక్కగా అలంకరించుకొని; మంగళగౌరిని భక్తిశ్రద్ధలతో పూజించి, ముత్తయిదువులను పిలిచి బొట్టు, కాటుకలు పెట్టి, పసుపు వ్రాసి, శనగలు పండు తాంబూలాలు ఇచ్చి, పాత స్నేహితురాండ్రను కలుసుకొని ఒకటే నవ్వులు, ఒకటే సందడి. తరువాత పౌర్ణమి ముందు వచ్చే రెండవ శుక్రవారం వరలక్ష్మీ వ్రతం నోచుకుంటారు. ఈ వ్రతం చిన్నా పెద్దా అందరూ నోచుకుంటారు.

మంగళగౌరీ నోము (వ్రతం) భర్త ఆయురారోగ్యములను కోరుతూ ఒక రాజకుమార్తె చేసిన వ్రతం. అల్పాయుష్కుడని తెలియక వివాహమాడి, వివాహానంతరం విషయం తెలుసుకొని, తాను కన్యగా ఉండగానే శ్రావణ మంగళగౌరీదేవిని భక్తిశ్రద్ధలతో పూజించి, ఆమె ఆశీర్వాదమువల్ల భర్తయొక్క గండమును గట్టెక్కించుకొన్నది ఆమె. ఇది ఐదు సంవత్సరాల నోము. గౌరీదేవిని పూజించి, ఐదు జ్యోతులను వెలిగించి, శ్రావణ మంగళగౌరీ పాటను పాడి, ఐదు బూరెలను ముత్తయిదువులకు ఇస్తారు.

ఇక వరలక్ష్మీ వ్రతం. ఇది అష్టఐశ్వర్యములను ప్రసాదించే వరలక్ష్మీ వ్రతం. ఒక పతివ్రత, సదాచార సంపన్నురాలైన ఒక స్త్రీ కలలో వరలక్ష్మీదేవి కనిపించి, శ్రావణ పౌర్ణిమ ముందు వచ్చే శుక్రవారం తనను పూజించమని, సకల శుభాలు కలుగుతాయని చెబుతుంది. ఆమె తన స్వప్న వృత్తాంతమును అత్తమామలకు, భర్తకు, ఇరుగు పొరుగు వారికి చెబుతుంది. ఆ ప్రకారం లక్ష్మీదేవిని పూజించి అష్టఐశ్వర్యములను వారు పొందినారు. అప్పటినుంచి ఈ లక్ష్మీదేవివ్రతము ప్రతి ఇంట్లో చేసుకోవటం ఆనవాయితీ అయింది. రెండవ శ్రావణ శుక్రవారంనాడు ఒక కళశం పెట్టి, దానిపై వరలక్ష్మీదేవి ప్రతిమనుంచి, యథావిధిగా, భక్తిశ్రద్ధలతో పూజించి పన్నెండు పూర్ణపు బూరెలు, బ్రాహ్మణునికి కాళ్ళు కడిగి యిస్తారు. తొమ్మిది రకాల కూరలు, తొమ్మిదిరకాల పిండివంటలు చేసి అమ్మవారికి నివేదిస్తారు. తొమ్మిది ముడులు గల తోరము ధరిస్తారు. తొమ్మిది తమలపాకులు, తొమ్మిది వక్కలు దేవికి సమర్పిస్తారు. ముత్తయిదువులకు పండు తాంబూలములు యిస్తారు.

శ్రావణపూర్ణిమను రాఖీ పండుగగా, జంధ్యాల పూర్ణిమగా పిలువటం వాడుక. క్రొత్తగా వడుగైన వటువులు ముంజ విడుస్తారు, జందెమును మారుస్తారు. గృహస్థులు పాత జందెములను తీసి క్రొత్తవి వేసుకుంటారు. గాయత్రీ మంత్రం పఠిస్తారు. అక్కచెల్లెళ్ళు, అన్నదమ్ములకు రాఖీలు కడుతారు, తీపిని తినిపిస్తారు. సోదరులు అక్కచెల్లెళ్ళకు క్రొత్త బట్టలు యిస్తారు. ఈ పండుగ సోదర, సోదరీప్రేమను ఇనుమడింపజేస్తుంది. ఈ పండుగ ఉత్తర భారతంలో బహు ఎక్కువగా జరుపుకుంటారు.

ఈ నోములు, వ్రతాలు సామాజిక చింతనను ఇనుమడింపచేస్తాయి. ఈ పేరుతో పదిమంది పెద్దలను ముత్తయిదువులను పిలిచి వారిని గౌరవించడంవలన వారి దీవెనలు లభించి నాలుగు కాలాలపాటు అష్టఐశ్వర్యములతో, ఆయురారోగ్యములతో జీవించుతారని మనవారి విశ్వాసం. ధనమున్నంత మాత్రాన సరిపోదు. ఆ ధనమును సద్వినియోగపరచడం ఎట్లాగో. ఈ నోములు, వ్రతాలద్వారా మన పూర్వీకులు మనకు నేర్పారు. "అదాన దోషేణ భవేద్దరిద్రః" అన్నారు గదా! దానం చేయకపోతే వచ్చే జన్మలో దరిద్రుడుగా జన్మిస్తాడు. ఈనాడు నవనాగరికులమని చెప్పుకొనేవారు తరచుగా "సామాజిక స్పృహ" కావాలంటుంటారు. ఈ పేరును మన పూర్వీకులు వాడకపోయినా, నోములు, వ్రతాలు, సంప్రదాయాల పేరిట మన పూర్వీకులు ఏనాడో ఈ "స్పృహ"ను మనలో కలుగజేశారు. తరాలు తరలినా, యుగాలు దొర్లినా ఈ చైతన్యం మనలో నిరంతరం ప్రవహిస్తూనే ఉన్నది, ప్రవహిస్తూ ఉంటుంది. మాటలు మారినా చేతలు మాత్రం మారలేదనడానికి ఈ నోములు వ్రతాలే ప్రత్యక్ష సాక్ష్యం. వీటిని భావితరాలవారు కూడ మరుపకుండా, ఆచరించి తాము తరిస్తూ, సమాజాన్ని ప్రభావితం చేస్తుంటారని ఆశిద్దాం.



## వింతలు - విడ్డూరాలు

పూర్వం క్రికెట్ ఆటగాళ్ళు నల్లటి టోపీలు ధరించి ఆడేవారు. వరుసగా మూడు విసరల్లో మూడు వికెట్స్ తీసిన ఆటగానికి నల్లటోపీకి బదులు తెల్లటోపీ ఇచ్చేవారు. 'HAT TRICK' అనే మాట ఇలా వచ్చింది. వింతగా లేదు! ఇప్పుడు మనం అనుకునే ఈ పదం వెనుక ఇంత కథ వుంది.

- వెల్లింగ్టన్ రాకుమారుని కున్న బల్లెన్ని ఎవరో అపహరించడంతో మళ్ళీ ఫైబర్ గ్లాస్‌తో తయారుచేసిన బల్లెన్ని ఆ విగ్రహానికి అమర్చారు. అయితే ఈ రాకుమారుడు బ్రతికి ఉండగా లార్డ్‌బైరన్ కనుచూపుదూరంలో ఉండేవాడు కాదు. ఒకర్నొకరు చూచుకోవటానికి ఇష్టపడేవారుకాదు. అయితే ప్రభుత్వం వారి విగ్రహాలని ఎదురెదురుగా పెట్టించింది. ఇహ చూచుకోక ఏంచేస్తారు!
- మార్క్ హెలింగర్ తన రచనల్ని భార్యకు అంకితం యిస్తూ "వారానికి మూడుసార్లు తాను ఒక్కతే సినిమాలకు, షాపింగ్‌కు వెళ్ళడంద్వారా ఈ రచనలకు అవకాశం ఇచ్చిన నా భార్యా రత్నానికి అంకితం యిస్తున్నాను" అన్నాడు. ఇది కొంతమందికి వింతకాదేమోలేండి!
- జపాను దీవులకి చెందిన కోచిలో ఒనగడోరి అనే వింత కోడిపుంజులకు 30 అడుగులకు మించిన తోకలుంటాయి. 300 సంవత్సరముల నుంచి ఆ దీవులలో ఉంటున్నాయి.
- "జేమ్స్ జాయిస్" ఏదైనా రాయాలంటే బోర్లా పడుకుని ఎదురుగా కాగితాలు పెట్టుకుని తల ఎత్తుకుని రాయవలసిందేనట. పొట్టమీద పడుకునే కట్టలు కట్టలు రాసేవాడట.

# విజ్ఞానవాణి

జి. ఎస్. సాయినాధ్

## సైకిల్

స్కాట్‌లాండ్‌లో డంఫ్రీస్‌కు చెందిన కిర్క్ పాట్రిక్ మాక్మిలన్ అనే కమ్మరి చెక్క చక్రాలకు ఇనుప పట్టాలు పైరుగా అమర్చి, పళ్ళచక్రాన్ని పెడల్స్‌ను ఏర్పాటుచేసి అది తొక్కితే చక్రం తిరిగే విధంగా సైకిల్ రూపాన్ని తొలిసారిగా 1839 లో తయారుచేసాడు. 1861 లో పారిస్‌కు చెందిన పెరిమి బెక్స్ సైకిల్ నిర్మాణాన్ని ఆధునికమైన పద్ధతిలో తయారుచేసాడు. 1848 లో సైకిల్ చక్రాలకు ఇనుప ఊచలు బిగించబడి తేలికగా, వేగంగా ప్రయాణానికి అనువుగా వుండేట్లు "కోవెంట్రి మెషిన్ కంపెనీ ఎరీల్" అనే పేరుతో సైకిల్‌ని ఉత్పత్తి చేసింది. సైకిల్ చక్రానికి చైను ఏర్పాటు 1880 లో టాంజంట్ అండ్ కోవెంట్రి ట్రైసిక్ల్ కంపెనీ లిడ్జి సైకిల్‌ను ఉత్పత్తి చేసింది. 1885 వరకు సైకిల్ రెండు చక్రాలు ఒకే సైజులో వుండేవి కావు. ఆ సంవత్సరంలో తయారైన "రోవర్ సేఫ్టీ" సైకిల్ నేడు మనం వాడుతున్న సైకిల్‌కు మాతృక. సైకిల్‌కు తుది రూపాన్ని చక్కగా ఏర్పాటు చేసిన ఘనత జాన్‌స్టెర్లీకి దక్కుతుంది.

## మోటార్ సైకిల్

1885 లో గ్లోటిబ్ డైమ్లర్ మోటారు సైకిల్‌ని తొలిసారిగా తయారుచేశాడు. డైమ్లర్ పుత్రుడు ఈ తొలి వాహనాన్ని నడిపాడు.. డైమ్లర్ పెట్రోల్‌తో నడిచే ఇంజను కనుగొనే ప్రయత్నంలో మోటారును కనుగొని, అప్పుడు వాడకంలో వున్న చెక్క సైకిల్‌కి అమర్చాడు. ఆ విధంగా మోటారుసైకిల్‌కు తొలి రూపాన్నిచ్చాడు. 1894 వరకు మోటారు సైకిల్ ప్రజల వినియోగానికై అమ్మకానికి రాలేదు. తొలిసారిగా మోటారు సైకిల్‌ని జర్మనీకి చెందిన మునిచ్‌లో ఉన్న "హిల్డ్ బ్రాండ్ వోల్ఫ్ ముల్లర్" అనే కంపెనీ మోటారు సైకిల్ ఉత్పత్తి ప్రారంభించింది. ఫ్రాన్స్‌లో అదే సంవత్సరం అలెగ్జాండర్ డాగ్ కూడా మోటారు సైకిలు తయారుచేయటం మొదలయింది.

( 33వ పేజీ తరువాయి )

## మేజువా

మొక్కల చీడకు మందు కొట్టండి, కాని మిమ్మల్ని మందు కొట్టమని చెప్పడంలేదు స్వామీ! అని ప్రజలందరికీ చెప్పాల్సిన రోజులొచ్చాయి. అయినా ఈ రోజుల్లో చెప్తే వినేదెవ్వరు ? ఎందుకనో ఈ మందంటే మంది భయపడ్తారుగాని — మందు కనక మితంగా లిమిటెడ్‌గా పుచ్చుకుంటే మనిషి ఆరోగ్యం మరింత బాగుపడుతుందంటున్నారు వైద్యశాస్త్రజ్ఞులు! అమెరికాలో నార్త్ కరోలినాలో వైద్యులు కొందరు చేరి ఈ మద్య ప్రభావాన్ని తెలుసుకోవాలని కోతులపై పరీక్షలు జరిపారుట ! రక్తంలో ఉండే కోలెస్టరాల్ అనే రసాయనపదార్థంవల్ల రక్తం గడ్డకట్టడం జరుగుతుంది. అందువల్ల హృద్రోగాలు వచ్చే ప్రమాదం ఉంది ! ఈ మద్యం మాత్రం — తగు మాత్రం మోతాదులో తీసికొన్న కోతులను పరీక్షిస్తే వాటికి ఏ రకమైన హృద్రోగం రాలేదుట ! అందుకనే వానరవారసులమైన మన నరులు హృద్రోగ నివారణకు, నిరోధానికి మందు కొట్టడం మంచిదని గ్రహించేసి అదే పనిగ సీసాలకు సీసాలు లాగించేస్తున్నారేమో ! ఏది ఏమైనా — అతి సర్వత్ర వర్జయేత్ గదా !

( సశేషం )

# వేమన పద్యాలు - ఆత్మతత్త్వ రహస్యాలు

శ్రీగుణాభిరామమై, యోగ తత్త్వ రహస్యానుసంధానమైన, వేదాంత వాస్తవాలను వివరించు వేమన గారి పద్యాలు చదువునపుడు వ్యంగ్యముగాను, అసభ్యముగాను పైకి గోచరించగలవు. ఉదాహరణకు :

ఆ॥ తల్లి తొలుత లంజె, తన యాలు మాదిగ
తాను బ్రాహ్మణుడన దగునె జగతి
తపసుచేత ద్విజుడు తర్కించ కులమేది
విశ్వదాభిరామ - వినుర వేమ

వశిష్ఠుని తల్లి ఊర్వశి, ఈమె భోగము కులస్తురాలు వశిష్ఠుని భార్య అరుంధతి, ఈమె మాదిగ కులస్తురాలు. ఇట్టి వశిష్ఠు డెట్లు బ్రాహ్మణుడగును. తపోమహిమ చేతనే వశిష్ఠుడు బ్రాహ్మణుడయ్యెనని తెలియగలదు. కావున ఆలోచించి చూడగా కులమనేది లేదనే భావన. పై పద్యములోని రహస్యార్థమును పరిశీలించవలసి యున్నది. దేహేంద్రియ, మనోబుద్ధులు, ప్రకృతి స్వరూపాలు. ఆ ప్రకృతి నుంచే సర్వమానవకోటి పుట్టుచున్నది. అందువలన ప్రకృతిని భోగము కులస్తురాలని సంకేతము చేసి వేమన భావించినాడు. ఎన్నో జీవరాసుల వుత్పత్తికి మూలమైన ఆ ప్రకృతి స్వరూపమే భార్యగా స్వీకరింపబడినది.

ఇంద్రియ చాపల్యాలకు, రకరకాల మోహాలకు గురిచేసి మానవుని పతనానికి దోహదంచేయు స్వభావం కల్గిన యీ ప్రకృతిని మాదిగ కులస్తురాలుగా - కవి భావించి, కవన మల్లినట్లు తెలియుచున్నది. జీవితము యొక్క మొదటి భాగాన్ని విషయ భోగములందు గడిపిన వేమనగారు వయసు దాటిన పిదప భోగాలపై విరక్తిభావంతో ఆత్మచింతనవైపు పయనించినారు. మహాపురుషుల దివ్య సాంగత్య ప్రభావమును సంతరించుకొన్నారు.

భగవదున్మాదియై దిగంబరుడై అవధూత స్థాయి నందుకొన్న మహనీయుడాయన సామాన్య జనుల వాడుకభాషలో లోకానికి, లోకాతీతమైన దివ్యతత్త్వాలను ప్రబోధము సల్పినారు.

పి. శీనప్ప శాస్త్రి

ఆ॥ మూటి నాగ్రహించి మూటి విసర్జించి
మూడి మూటి మూట - మూటరోసి
మూటి మూటి మూటి మూట నే తత్త్వంబు
విశ్వదాభిరామ - వినుర వేమ

సత్త్వ, రజ స్తమో గుణాలను దాటవలెననియు, దారేషణ, ధనేషణ, పుత్రేషణ యీ మూడు కోరికలను విడచిపెట్టవలెనని ఆధ్యాత్మిక, ఆధి భౌతిక అధిదైవిక తాపాలను దూరం చేసుకోవాలనియు తెల్పినాడు. అసూయ, దంభము, అహంకారము యీ మూడింటిని త్యాగం చేయవలసిన అవసరాన్ని గుర్తు చేసినాడు. రాగము, ద్వేషము, కామము - యీ మూడు అవలక్షణాలను మరచినపుడు, త్వంపదము, తత్పదము, అసిపదము అనునట్టి మహావాక్యాల నవగాహనం చేసుకొని- మానవుడు తరించగలడని వేమనగారు వివరించినారు. ఆత్మతత్త్వ రహస్యాలను వేమనగారు ఆటవెలది పద్యాలలో సమాజానికందించి జన్మ సార్థక్యమును సాధించినారు.



# శ్రీకృష్ణుని అనుగ్రహ మహిమ

ఒకప్పుడు శ్రీకృష్ణుడు తన వాహనమైన గరుడుని పిలిచి, యక్షరాజగు కుబేరుని ఉద్యానవనమున నున్న సౌగంధిక కమలములను తీసుకొనిరమ్మని పంపాడు. వెంటనే బయలుదేరాడు గరుడుడు. అతనిలో అహంకారము తలఎత్తసాగింది. "ఆహా! ఈముల్లోకము లందును నావంటి బలశాలియు, పరాక్రమశాలియు బహు వేగంగా పయనించే శక్తిగలవారును ఎవరున్నారు ?" అని అహంభావంతో తన పెద్ద రెక్కలను విశాలముగా విరిచి, అత్యంత వేగంతో పయనించసాగాడు. వాటి ధాటికి దిక్కులు ప్రతిధ్వనించినవి. కొంతసేపటికే గరుడుడు గంధమాదన పర్వతం చేరుకొని, సౌగంధిక కమలములను కోయసాగాడు.

అదేచోట శ్రీరామ భక్తాగ్రగణ్యుడైన హనుమంతుడు శ్రీరామ నామమును భక్తితో జపించుకుంటూ వశిస్తున్నాడు. అత్యంత అట్టహాసంతో సౌగంధిక పుష్పములను కోయుచున్న గరుడుని చూచి అతను ఇలా ప్రశ్నించాడు. "పక్షిరాజా! నీవు ఎవరికోసము ఈ పుష్పములను సేకరించుచున్నావు ? ఈ ఉద్యానవనమునకు యజమాని యగు కుబేరుని అనుమతి లేకుండ నీవు పుష్పములను కోయుట ధర్మసమ్మతము కాదు గదా ?" అని అన్నాడు.

గర్వాంధకారముతో నున్న గరుత్మంతుడు- వెంటనే "నేను శ్రీకృష్ణపరమాత్మని ఆజ్ఞానుసారము ఈ పుష్పములను సేకరించుచుంటిని. ఇందుకు ఎవరి అనుమతియు కావలసిన పనిలేదు" అని నిర్లక్ష్యంగా సమాధాన మిచ్చాడు.

గరుడుని సమాధానము ఆంజనేయునికి మిక్కిలి కోపము కలిగించినది. ఒక్క దూకుతో గరుడుని ఒడిసి పట్టుకొని తన చంకలో పెట్టుకున్నాడు. ద్వారకకు బయలుదేరాడు. హనుమంతుని వాలకమును చూచి అండమే అదరిపడింది. ద్వారకవాసులు భీతి చెందారు. హనుమంతుని వేగమును అడ్డగించుటకు శ్రీకృష్ణుని ఆయుధమైన సుదర్శనచక్రము హనుమంతుని పైకి వచ్చింది. అంతే - హనుమంతుడు ఆ సుదర్శన చక్రమును కూడ ఒక్క ఉరుకుతో పట్టుకొని తన రెండవ చంకలో ఇరికించుకున్నాడు.

హనుమంతుని ఈ క్రీడా విలాసము నంతటిని మందహాసవదనంతో గమనిస్తూనే ఉన్నాడు కృష్ణపరమాత్మ. మాయలలో ఆరితేరినవాడు కదా మాధవుడు! ఆతడే యీ నాటకమునకు కూడ సూత్రధారి.

మాధవుడు తనతో ఉంటున్న పట్టపు రాణులకు హనుమంతుని చూపిస్తూ- "ఇదిగో చూడండి! వాయు నందనుడు అత్యంత కోపంతో వస్తున్నాడు. ఇట్టి సమయంలో సీతాసమేతుడైన శ్రీరామచంద్రుడు అతని సమక్షములోకి వస్తే సరిపోతుంది. లేకపోతే, అతనికి ఉంటున్న కోపానికి అతను మన ద్వారకను అల్లే పెకలించి సముద్రములో విసరివేయగలడు సుమా! అందువల్ల మీలో ఎవరైననుసరే, వెంటనే సీత వేషమును ధరించండి. నేను రాముని వేషమును ధరిస్తాను" అన్నాడు.

అలా అంటూనే కృష్ణమూర్తి శ్రీరామచంద్రుని రూపమును క్షణాలపై ధరించాడు కాని అతని పట్టపురాణులు ఎంతగా ప్రయత్నించియు సీతలా తమ రూపములను మార్చుకొనజాలరైరి.

తుదకు పట్టపు మహిషులందరు ఒక్కటిగా చేరి, చక్కగా ఆలోచించి రాధను తీసుకువచ్చారు. రాధ వెంటనే సీతగా మారిపోయింది. శ్రీకృష్ణుని పట్టపు రాణులకు సాధ్యము కాని పనిని రాధ చిటికెలో

సీతవలె మారిపోయింది. సీతగా మారిన రాధ రామునిగా మారిన శ్రీకృష్ణుని ప్రక్కన వెళ్ళి కూర్చుంది.

అప్పటికి హనుమంతుడు కూడ వచ్చి అచ్చటికి చేరాడు. తన ఎదురుగా ఆసీనులైయున్న శ్రీరామ చంద్రుని, సీతామాతను గాంచి పరమానందపరవశుడై వారికి సాష్టాంగముగా నమస్కరించాడు.

అట్టి సమయంలో కూడ హనుమంతుడు తన చంక లలో పుంచుకొనియున్న గరుడుని, సుదర్శనచక్రమును వదలకుండా గట్టిగా జాగ్రత్తగా పట్టుకున్నాడు.

శ్రీరాముని రూపములో నున్న మధుసూధనుడు హనుమంతుని ఆశీర్వదిస్తూ "నాయనా! హనుమంతా, నీ చంకలలో ఏదో ఉన్నట్టు కనిపిస్తున్నవే! అవేమిటి?" అని ప్రశ్నించాడు.

హనుమంతుడు వినయపూర్వకముగా "స్వామీ! అవి! వేరేమీ కావులెండి. నేను జనసంచారము లేని ఒకచోట కూర్చొని రామ నామ జపము చేసుకొని చుంటిని. అపుడు ఒక అల్పమైన పక్షి నాకు విక్షిప్తము కలిగించింది. అందువల్ల దానిని ఒడిసి పట్టుకున్నాను. ఇంకొక చిన్న చక్రము లాంటిది కూడ నా దారికి అడ్డు పడి నన్ను గాయపరచడానికి ప్రయత్నించింది. దాన్ని కూడ అలాగే పట్టుకొని మరో చంకలో పెట్టుకున్నాను స్వామీ! తమకు పుష్పములు కావలసినచో నాకు ఆజ్ఞాపించరాదా? ఆ అల్ప పక్షికి అత్యంత బల పరాక్రమశాలియైన కుబేరుని ఉద్యానవనము నుండి పుష్పములు తీసుకురావడానికి చాలినంత శక్తిసామర్థ్యము లున్నవా యేమి?" అన్నాడు.

అందుకు పరంధాముడు - "నాయనా! పాపము వారిని వదిలివేయుము. నీవు గావించిన యీ పనికి నేను చాల సంతోషిస్తున్నాను. నీవింక నీ ఏకాంతమగు ఉద్యాన వనమునకు వెళ్ళి నీ జపమును పునఃప్రారంభించ వచ్చును" అన్నాడు. శ్రీరామచంద్రుని ఆజ్ఞానుసారము హనుమంతుడు గరుడుని సుదర్శన చక్రమును విడుదల చేశాడు. తరువాత "జయ జయ రామ్, సీతారామ్" అని పాడుకొంటూ గంధ మాధన పర్వతమునకు బయలు దేరాడు.

తన వేగమును గురించి గరుత్మంతుడు, తన ప్రభావమును గురించి సుదర్శన చక్రము, తాము చాల అందగత్తెలమని భావించు శ్రీకృష్ణుని భార్యలకు శ్రీకృష్ణభగవానుడు వీరి అందరి గర్వమును ఒకేసారి ఈ విధముగా రూపు మాపాడు.

సేకరణ: తాటికొండ తిరుపతయ్య

ఇది పాఠశాల - విద్యా పాంథశాల
విజ్ఞానామృతము తనివితీర గ్రోలు పాఠశాల
వెదురును మార్చు వేణువుగ - శిలను తీర్చు శిల్పముగ
కలలను కూర్చు కావ్యముగ - మనిషి నొనర్చు మనీషిగ
తేట తేట మాటలతో - ఆటలతో పాటలతో
విశ్వ రహస్యాల మూట - విప్పు వేదశాల
ప్రకట పంచశీల - ప్రగతి రథాంగపు సీల
క్రమబద్ధానుగత భావిపౌర పురోగతి శీల ॥ఇది పాఠశాల॥

- పన్నాల ప్రభాకరశర్మ 

# దొండ తీగ

యస్. ఎన్. దుర్గారావు

ఇది పెద్ద తీగ జాతిలోనిది. దీనిలో రెండు రకములు గలవు. పొడుగు కాయలు గలది. పొట్టి కాయలు గలది. ఆకు త్రికోణములు గలదై గుండ్రముగా నుండును. పింజ నుండి పువ్వు బయలు దేరును. ముదిరిన పింజ నుండి పువ్వు యెండి రాలిపోవును. పువ్వు తెల్లగా నుండి నాలుగు రేకులు గలిగియుండును. కాయలపై తెల్లని చాఱలుండును. పండిన కాయ ఎఱ్ఱని లక్క కాయ వలె నుండును. పండ్లలో గింజ లున్నను అవి మొలుచుచున్నట్లు కన్పించుటలేదు. దీని తీగయే విత్తనము.




దీని ఆకు కూర తియ్యగ నుండును. లఘుగుణము, వాత హరము, చలువ చేయును, మలబద్ధము చేయును.

పువ్వు పైత్యహరము, దురదలను హరించును. కామలా రోగమును పోగొట్టును.

దొండకాయలు కూరగా వండి తినటం మనందరకు ఎరుకయే కదా ! గురు గుణము చేయును, అజీర్ణకారి. పండిన పండ్లు తీపి రుచిగా ఉండును. ఇవి శీత వీర్యము. విపాకమున మధుర రుచి. గురుగుణము, వాతహారి, పైత్యరక్తహారి, రుచిని గల్గించును. దగ్గును, శ్వాసను, క్షయను హరించుటే గాక స్తన్యమును వృద్ధి నొందించును. ఇంకా వీర్యస్థంభనము చేయు గుణము కూడా గలది.

వేరు చలువ చేయునట్టి గుణము గలది. ధాతు పుష్టిని గల్గించును, మేహములను హరించును. త్రిప్పును పోగొట్టును, వాంతిని కొట్టును. కాళ్ళయొక్కయు, చేతియొక్కయు మంటలను తగ్గించును.

దొండకాయలను కూరగా చేసుకొని అతిగా తినిన అజీర్తి చేయును, బుద్ధి మాంద్యము కలుగును. శ్లేష్మము పెరుగును. పండ్లను ఎక్కువగా సేవించి నందున కడుపుబ్బరము గలుగును. మొత్తమునకు దీని సర్వాంగములు కూడా ఉపయుక్తమే !

దొండాకు పసరులో పెగ్గుమ్మడి పండ్ల రసమును, హారతి కర్పూరమును కలిపి రాసిన పుట్టె మాదలు హరించును; ఆకు రసము కంటిలో పిండినను పెరుగులో కలిపి లోనికిచ్చినను కామల కట్టును. దీనికి పథ్యము పెరుగు అన్నము; దొండవేరును నీడను యెండించి చక్కగా చూర్ణము గావించి, తేనెతో కలిపి తినుచున్న ధాతువృద్ధిని నిలుగజేయును మరియు శుక్ర నష్టమును కట్టును.

## విదుర నీతి

"యజ్ఞో దానమధ్యయనం తపశ్చ
చత్వార్యేతాన్యన్వవేతాని సద్భిః
దమః సత్యమార్జవ మానృశంస్యం
చత్వార్యేతాన్యనుయాన్తి సన్తః"

యజ్ఞము చేయుట, దానమొసంగుట, అధ్యయనము, తపస్సు అను నాలుగు గుణములు నిత్యము సత్పురుషులలో ఉండునట్టివి. సత్యము, అర్జవము ( వంకర బుద్ధి లేకుండుట ), అనృశంస్యమ్ ( క్రూరత్వము లేకుండుట ) నిగ్రహము అను నాలుగు గుణములను సత్పురుషులు ఎల్లప్పుడు అనుసరించు చుందురు.



## బంధనలకు మూలం

# అభిమాన అహంకారము

"న పుణ్యం న పాపం న సౌఖ్యం న దుఃఖం
న మంత్రో న తీర్థం న వేదా న యజ్ఞాః
అహం భోజనం నైవ భోజ్యం న భోక్తా
సచ్చితానంద రూపం సత్యం శివం సుందరమ్"

నేను పుణ్యంకాదు, పాపము కాదు. నేను సౌఖ్యము కాదు, దుఃఖము కాదు, నేను మంత్రము కాదు, తీర్థము కాదు. నాకు వేద యజ్ఞములు లేవు. నేను భోక్తను కాదు, భోజనము కాదు. నేను సచ్చిదానంద స్వరూపమైన సత్యం శివం సుందరం.

ఈ మంత్రం ప్రతి వ్యక్తికి సంబంధించినది. మానవుడు సుఖాభిలాషి, ఆనందపిపాసి, అహోరాత్రములు అనేక శ్రమలు పడి యీ సుఖానందములను సంపాదించుకొనుటకై కృషి చేస్తున్నాడు. అన్ని రంగములయందు మానవుడు ఆశించునవి రెండు. 1) సుఖప్రాప్తి, 2) దుఃఖనివృత్తి. మానవుడు సుఖాన్ని కోరటంలో ఆనందమును ఆశించుటలో అంతరార్థము ఏమిటి? మానవుని స్వభావము, స్వరూపము ఆనందమే. అతను సుఖస్వరూపుడు. తన స్వభావమైన ఆనందమును సుఖమును ఆశించుటకు అతనికి అధికారమున్నది. చక్కెర సహజంగా తీపిగా ఉంటుంది. ఈ తీపి చక్కెర యొక్క స్వభావము. తన స్వభావమైన తీపిని కోల్పోయిన అది చక్కెరే కాదు. విచ్చిన గులాబి పరిమళమును అందిస్తుంది. ఇది దాని స్వభావము. అదే విధముగనే మానవులు సుఖమును, ఆనందమును కోరుట వారి స్వభావమే కనుక వారికి ఈ అధికారమున్నది. తన స్వభావమైన సుఖానందములు కోల్పోయినవాడు మానవుడే కాదు. మానవుడు తాను సుఖము కోరుట లోపల వుండిన రహస్యాన్ని అర్థం చేసుకోవాలి. ఒక చిన్న ఉదాహరణము. సహజమునకు విరుద్ధమైన స్థితి విచిత్రముగాను, వికారముగాను రూపొందుతుంది. మనము మార్గంలో నడుస్తున్న సమయంలో దుఃఖిస్తున్న ఒక వ్యక్తిని చూచామనుకోండి. అటూ యిటూ పోయే ప్రతి మానవుడు అక్కడ నిలచి అతని దుఃఖమునకు కారణమేమని ప్రశ్నిస్తాడు.

**శ్రీసత్యసాయిబాబా**

దీనికి అంతరార్థము ఏమిటి? తన స్వభావముకాని దుఃఖమును అతను అనుభవించడమే. స్వభావము కాని దానిని అనుభవిస్తున్నది చూచిన ప్రతి వ్యక్తి ఆశ్చర్యంగా ప్రశ్నిస్తాడు. అదే బజారులో ఆనందంగా నవ్వుతూ ప్రసన్నుడై వున్న వ్యక్తిని చూచామనుకోండి అతన్ని చూచి నీవు ఎందుకు ఏడ్వటంలేదని ఎవరూ ప్రశ్నించరు. ఆనందం ప్రసన్నత అతని స్వభావం. స్వభావమునకు ఎట్టి ఆశ్చర్యముండదు. అస్వభావమునకే ఆశ్చర్యము. ఆనందము, సుఖము మానవుని స్వభావమని గుర్తించలేకపోతున్నారు. వీటిని అందించే నిమిత్తమై, అందుకొనే నిమిత్తమై దేహేంద్రియ మనోబుద్ధులు ఏర్పడినాయి. దురదృష్టవశాత్తు వీటిల్లో దోషములు చేరిపోవుటచే తన స్వభావమును, స్వరూపమును మరచి మానవుడు విచార నిమగ్నుడవుతున్నాడు. దేహము రాగద్వేషములనే మాలిన్యముచే కప్పబడినది. ఇంద్రియములు భోగభాగ్యములనే మాలిన్యముచే కప్పబడినవి. మనస్సు ఈ రెండిటిచేత కప్పబడింది. కనుక మావవుడు తన స్వరూపాన్ని తాను తెలుసుకోలేకపోతున్నాడు.

మానవుడు భుజించే ఆహారమువల్ల రాగద్వేషములు అభివృద్ధి అవుతున్నాయనే సత్యాన్ని గుర్తించి, మన ప్రాచీనులు భుజించుటకుపూర్వం ఆహారమును పరిశుద్ధం గావించుకునేవారు. "అన్నం బ్రహ్మా రసో విష్ణుః భోక్తా దేవో మహేశ్వరః" అని ప్రోక్షించుకునేవారు. ఈ భుజించే అన్నం బ్రహ్మతో సమానం. రసము అనగా త్రాగేనీరు భుజించే పదార్థముల సారము విష్ణు స్వరూపము. తినేవాడు మహేశ్వరుడు. భుజించే అన్నం శాశ్వతమైన ఆనందాన్ని అందించాలి - అని ఋతం సత్యంతో ప్రోక్షింపబడుతున్నది. బ్రహ్మ విష్ణు మహేశ్వర స్వరూపులైన మీరు ఋతం సత్యం యొక్క స్వభావాన్ని మాకు అందించండి - అని ఆహారమును ఋతముగా, సత్యంగా మార్చుకొనే నిమిత్తమై ప్రోక్షించి, పవిత్రము గావించి ప్రసాదముగా స్వీకరించేవారు మన ప్రాచీనులు. అయితే ఈనాటి మానవుడు మేధాశక్తినే ప్రధానము గావించుకొని ఈ ఋతం, సత్యం అనేదానిని విస్మరించి, మేధాశక్తికి మించిన మరొక శక్తిలేదని విఱ్ఱవీగుతున్నాడు.

శంకరాచార్యులవారు దిగ్విజయయాత్ర చేసే సమయమందు మండనమిశ్రునితో వాదన ఏర్పడింది. వీరిద్దరి జయాపజయములు నిర్ణయించుటకు సత్యవాణి, పవిత్ర హృదయము, దివ్యభావము, ఋతసంపత్తు, శ్రద్ధ, స్థిరత్వము కలిగిన "ఉభయ భారతి" ని జడ్జీగా నియమించినారు. ఈ ఉభయభారతి మండనమిశ్రుని భార్య. లోకములో ఎవరైనా జయాపజయములు నిర్ణయించమని ఆపోజిట్ పార్టీవారి భార్యను కోరుతారా? భార్య తన భర్త విజయమును కాంక్షిస్తుందిగాని, సమత్వంతో న్యాయనిర్ణయం చేస్తుందా? కాని శంకరాచార్యులవారు మేధాశక్తికంటే బుద్ధిశక్తి ఉత్కృష్టమైనదని, శక్తివంతమైనదని భావించే ఉభయభారతిని నిర్ణయము చేశారు. మేధస్సుకంటె బుద్ధి చాలా శక్తివంతమైనదనే సత్యాన్ని విద్యార్థులు గుర్తించాలి. బుద్ధి అనగా ఆలోచనాశక్తి, విచారణాశక్తి, వివేకశక్తి, విజ్ఞానశక్తి మాత్రమే కాదు, విచక్షణాశక్తితో కూడిన విచారణాశక్తి. ఉభయభారతి ఈ వాదనలో తన భర్త (మండనమిశ్రుడు) ఓడిపోయినట్లు అంగీకరించింది. ఇది సత్య ఋతములతో కూడిన నిర్ణయము. ఇంతటితో ఆగక శంకరులవారికి శిష్యుడవ్వమని, సన్యాసం స్వీకరించమని తన భర్తను ఆదేశించింది. ఉభయ భారతి గృహస్థధర్మము నందున్న ధర్మపత్ని కనుక, స్త్రీ జాతికి సరియైన ఆదర్శాన్ని అందించాలనే ఉద్దేశ్యంతో, తన భర్త సన్యాసము స్వీకరించినప్పుడు, తాను కూడా సన్యాసమును స్వీకరించడం ధర్మమని భావించి సన్యాసమును స్వీకరించింది. భర్తను అనుసరించడం భార్యల సహజ ధర్మము గదా! ఆమె నిజముగా సన్యాసము స్వీకరించనవసరంలేదు. కానీ లోకాదర్శ నిమిత్తమై ఆ విధంగా చేసింది. చెప్పినదానిని చేయటమే సత్యం. తలచినదానిని చెప్పడం, చెప్పినదానిని చేయటమే ఋతము.

ఉభయ భారతి పరిశుద్ధ హృదయురాలు. మేధాశక్తిచే జయము సంపాదించాలనే అపేక్ష కలిగిన అహంకార వ్యక్తులకు సరియైన మార్గము నిరూపించాలనే సంకల్పముతో ఒక ఆశ్రమము నిర్మించుకొన్నది. నదిలో స్నానముచేసే నిమిత్తమై కొంతమంది శిష్యురాండ్రతో ఒకనాడు ఆమె ఆశ్రమం నుంచి బయలుదేరింది. మార్గమధ్యములో ఒక సన్యాసి నీరు త్రాగే సొరకాయ బుర్రను బయటపెడితే ఎవరైనా దొంగిలిస్తారనే భయముచేత తలకిందపెట్టుకొని పడుకున్నాడు అతనికి జ్ఞానోపదేశము చేయాలని "ఉభయ భారతి" అతను వినునట్లుగా తన శిష్యురాండ్రతో "చూడవే! అతను సర్వసంగ పరిత్యాగి. కాని సొరకాయ బుర్రమీద మాత్రం అభిమానం పోలేదు. ఈ అల్పమైన దానియందే ఇంత అభిమానమున్నప్పుడు, ఇంత ఘనమైన దానియందు అభిమానము ఎంతగా ఉంటుందో! ఇతని పేరుకు తగిన ప్రవర్తన కాదే!" అన్నది. ఈ మాటలు విన్న సన్యాసికి మనసులో బాధ,ఉద్రేకముతో పాటు ఒక స్త్రీ నన్ను ఇంతమాట అనటమా! అని ద్వేషముతో సొరకాయ బుర్రను ఉభయభారతి పాదాల

పద్దకు విసిరివేస్తాడు. అప్పుడు ఉభయభారతి "అయ్యో! పాపం! పట్టి అభిమానమే కాదే! అహంకారం కూడా ఉంది" అనింది. "ఈ అభిమాన అహంకారములు ఉండినంతవరకు మానవులు ఆత్మను అర్థంచేసుకోలేరు ఆత్మానందము పొందలేరు". అన్నది. ఈ సత్యాన్ని గ్రహించిన ఆ సర్వసంగ పరిత్యాగి పరిగెత్తివచ్చి ఆమె పాదాలపై పడి తన దోషములను క్షమించమని కోరాడు. మానవులకు అన్నివిధములైన బంధనలకు మూలకారణము అభిమాన అహంకారములే. నేను అనే అహంకారం, నాది అనే మమకారం రెండూ పోయినప్పుడే నీవు నీవుగా నిలుస్తావు.

ఈ అహంకార మమకారాలు మనం తినే ఆహారము చేతనే ఉద్భవిస్తాయి. దుష్టమైన, దురార్జితమైన ఆహారము మానవుని అనేక విధములుగా అజ్ఞానములో ముంచుతుంది. పవిత్రమైన భావములను అణచగొడుతుంది. ఎక్కడ, ఎప్పుడు, ఎవరితో, ఏవిధంగా, ఏమి మాట్లాడాలనే విషయం మరచిపోతుంది. భీష్ముడు మహాత్యాగి, మహాజ్ఞాని. అతని దీక్షను ఇట్టిది, అట్టిది అని ఎవ్వరు వర్ణించలేరు. పితృవాక్య పరిపాలనను శ్రీరామచంద్రుడు 14 సంవత్సరాలు వరకు మాత్రమే పాటించాడు. కాని భీష్ముడు తండ్రి ఆజ్ఞను యావజ్జీవితము అనుసరించాడు. దృఢమైన సంకల్పము కలిగినవాడు కనుకనే అతనికి భీష్ముడు అని పేరు వచ్చింది. ప్రతిజ్ఞలయందు భీష్మునికి మించినవారు చరిత్రయందు కానరారు. అట్టి భీష్ముడు మహాభారత యుద్ధమునందు తొమ్మిదవ దినమున నేలకూలినాడు. శరతల్పముపైన పరుండినాడు. పాండవులు ద్రౌపదితో సహా పితామహుణ్ని దర్శించడానికి వస్తారు. అప్పుడు భీష్ముడు వారికి శాంతిపర్వమును బోధిస్తాడు. ఎన్నో హితవులు ధర్మసూక్ష్మాలు బోధిస్తాడు. ఈ విధంగా బోధించేటప్పుడు ద్రౌపది ఫక్కున నవ్వుతుంది. అందులో ఒక స్త్రీ అందరిముందు ఈ విధంగా నవ్వినందులకు అందరూ విచారిస్తారు. అర్జునునకు కన్నులు ఎఱ్ఱపడుతాయి. ధర్మజుడు తలవంచుకుంటాడు. నకుల సహదేవులు విచారపడుతుంటారు. పాండవుల గౌరవ ప్రతిష్ఠలు మంటగలిసాయని అందరూ విచారపడనులవుతారు. అది గుర్తించిన భీష్ముడు "ధర్మరాజా! ద్రౌపది గొప్ప బుద్ధి కలిగినది. ఆమెను మించిన పతివ్రత ఈ జగత్తునందు కానరాదు. ఆమె మహా గుణవంతురాలు. ఆమె కారణములేని కార్యము చేయదు. ఆమె నవ్వటానికి కారణమున్నదని చెబుతూ "అమ్మా! ద్రౌపదీ! దగ్గరకురా!" అని పిలిచి నీ నవ్వుకు కారణమేమిటో నీ పతులకు అర్థమయ్యేట్లుగా వివరించమంటాడు. అప్పుడు ద్రౌపది "పితామహా! నవ్వుట నా దోషమే కాని అన్యాయ, అక్రమ, అసత్య, అనాచారములతో ప్రవర్తించిన కౌరవులకు బోధించవలసిన నీతులు సత్యధర్మనిరతులైన పాండవులకు బోధించటంలో అర్థము ఏమిటి? పాండవులు ఏనాడూ అధర్మమును ఆచరించలేదు, అక్రమములలో ప్రవేశించలేదు. వారు నిత్య సత్యవ్రతులు. ఇలాంటి వారికి మీ బోధ వృథా. మీ బోధలు దుర్మార్గులు, దుష్టులు అయిన కౌరవులకు అత్యవసరం, పాండవులకు కాదు" అని అంటుంది. అప్పుడు భీష్ముడు "ద్రౌపది! నేను కౌరవుల పక్షమున వుండినవాడను. నేను వారి ఉప్పు పులుసు తిన్నాను. వారి అన్యాయ, అక్రమ, అనాచార, అసత్యములతో కూడిన ఆహారము భుజించడంచేత నా రక్తమంతా అన్యాయ, అక్రమముగానే మారిపోయింది. నీ పతి అర్జునుడు వేసిన బాణములచేత ఆ మలిన రక్తమంతా

"మంచివారిని చూచి ఈర్ష్య పడరాదు. ఈర్ష్యయే అన్ని అనర్థాలకు మూలము. మంచి స్థితిలో వున్నవారిని చూచి సంతోషించండి. హీనస్థితిలో వున్నవారిని చూచి జాలి పడండి. సహాయం చేయగలిగిన చేయండి. హాని మటుకు చేయవద్దు."

- శ్రీ సత్యసాయిబాబా

కారిపోయింది. అట్టడుగున ఉన్న ధర్మములు ఇప్పుడు బయటికి వస్తున్నాయి. ఇంతకాలం ఈ చెడు రక్తమే కప్పిపెట్టింది. ఇప్పుడు అది 'పోయింది' అని అంటాడు. కనుక ఆహారము యొక్క ప్రభావము ఎంతటిదో చక్కగా విచారించండి. ద్రౌపది నవ్వు వల్ల ఈ పరమ సత్యం బయటపడింది.

రాగద్వేషములుకాని, అభిమాన మమకారములుగాని ఆహారము చేతనే సంభవిస్తున్నాయి. ఆహార నియమము అనేది మనోబుద్ధులకు అత్యవసరము. మనసు యొక్క తత్వము చాలా విచిత్రము. శాస్త్రములన్నియు దీనిని ఏవిధముగా నిర్ణయించాయంటే... మానవుడు ఇంద్రియములను అనుసరించడంచేత పశువైపోతున్నాడు. మనసును అనుసరించడంచేత మనిషి అవుతున్నాడు. బుద్ధిని అనుసరించడంచేత మహనీయుడవుతున్నాడు. ఆత్మను అనుసరించినవాడు తానే బ్రహ్మగా మారుతున్నాడు. కనుక బుద్ధి ననుసరించి మహనీయుడుగా మారకపోయినప్పటికీ కనీసం మనసునైనా అనుసరించి మానవుడిగానైనా జీవించడం నేర్చుకోవాలి. మనసు కూడా చెడ్డదికదాయని చాలామంది సందేహించవచ్చు. మనసు ఎప్పుడూ పరిశుద్ధమైనదే. ఇంద్రియములను అనుసరించడం చేతనే మాలిన్యమవుతున్నది. ఇంద్రియములు సేకరించిన విషయ సామాగ్రిని మనస్సుకు అందిస్తున్నాయి. మనసు స్వయంగా విషయాన్ని స్వీకరించటంలేదు. ఇంద్రియాలు సేకరించి ఇచ్చిన దానినే అనుభవించడంచేత మాలిన్యమును పొందుతున్నది. మనస్సు బుద్ధినికూడ కొంచం అనుసరించినదంటే వివేక, విచక్షణా విచారణా జ్ఞానములు ... బుద్ధి వచ్చి చేయదగినదేదో, చేయదగనదేదో చేసుకొని తదనుగుణంగా ప్రవర్తిస్తుంది. ... మనస్సు బుద్ధిని అనుసరించడంలేదు. ఇంద్రియ... అనుసరించడంవలననే మానవుడు పశువుగా ప్రవర్తిస్తున్నాడు. అన్యాయ అక్రమాలకు పాల్పడుతున్నాడు, పతనమవుతున్నాడు. భుజించే ఆహారంవల్లనే అభిమాన అహంకార మమకారములు; రాగద్వేషములు అభివృద్ధి అవుతున్నాయి కనుక భుజించుటకు పూర్వం మనం ఆహారమును పరిశుద్ధం గావించుకోవాలి.

(బెంగుళూరులో శిక్షణా తరగతులలో ది 27-5-1990 న భగవాన్ బాబావారు చేసిన దివ్య ప్రసంగము నుండి)



శ్రీ బి. వి. అప్పారావు
అడ్వకేట్
ఖమ్మం - 507 001

"శ్రీ వాణి"
విత సభ్యులు



శ్రీ కొత్తగుండ్ల వెంకటేశ్వరరావు
ము ... దు - 521 190
నందిగామ మండలం, కృష్ణాజిల్లా